మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి

త్రై మాసపత్రిక
ఏప్రిల్ - జూన్, 2013



## ఇప్పటికైనా పోలీసు వ్యవస్థను సంస్కరించాలి

## అత్యాచారాలను నిరసిస్తూ పెల్లుబికిన దావాగ్ని

# కందుకూరి సాంఘిక శుద్ధి ఉద్యమం



**ఏప్రిల్ 16**
**కందుకూరి జయంతి**
**సందర్భంగా...**

కందుకూరి సాంఘిక శుద్ధి ఉద్యమం ఆంధ్రప్రదేశంలో మొదలెట్టడానికి ముఖ్యలక్ష్యాలు మూడు ఉన్నాయి. 1. దేవదాసి వ్యవస్థను రద్దు చేయడం. దీంట్లో భాగంగానే సాని నృత్యాలను నిర్మూలించడం. 2. మద్యపాన నిషేధం. 3. వ్యక్తిగత జీవితంలో నైతిక సూత్రాలను పాటించి స్వచ్ఛమైన జీవితాన్ని గడపడం. దేవదాసీ వ్యవస్థ గూర్చి, దాని రద్దుకు రఘుపతి వెంకటరత్నం, వీరేశలింగం కృషి జరిపారు.

మద్యపాన నిషేధ సంస్కరణను వీరేశలింగం అభిలషించాడు. సమాజక్షేమం కోరే వారందరు ఈ దురాచారాన్ని తొలగించాలని దానికవసరమైన చర్యలు చేపట్టాలన్నాడు. మద్యపానం వల్ల సమాజంలో పేదరికం పెరుగుతుంది. నేరాలెక్కువవుతాయి. మద్యం తాగేవారి ఆరోగ్యం పాడౌతుంది. ఆంగ్ల ప్రభుత్వం అబ్కారీ ఆదాయం కోసం ఈ దురాచారాన్ని ప్రోత్సహిస్తున్నదని వీరేశలింగం విమర్శించాడు. ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడం కోసం రచనలు చేశాడు. మద్యపాన వ్యతిరేకోద్యమం జాతీయోద్యమంలో భాగంగా చేపట్టడంతో పత్రికలు, ప్రజలు దాన్ని బలపర్చాయి.

వీరేశలింగం చేపట్టిన మరో రెండు సంస్కరణల గూర్చి చెప్పుకోవాలి. ఒకటి, వివాహ సందర్భాల్లో చేసే వృథా ఖర్చు. రెండు, సముద్రయానంపై విధించిన నిషేధాన్ని తొలగించడం.

పెళ్ళి సందర్భాల్లో అయ్యే ఖర్చువల్ల అనేకులు తమ ఆస్తులను కోల్పోయి దివాలా స్థాయికి దిగజారడం ఆనాటి సమాజంలో సాధారణంగా జరుగుతుండేది. ఇది కేవలం సంపన్న కుటుంబాలకే గాక మధ్య, కింద తరగతులకు కూడా వర్తించేది. అయిదురోజులు ఆర్భాటంగా జరిగే పెళ్ళిళ్ళను, వాటిలోని విందు భోజనాలను, కర్మకాండలను వీరేశలింగం విమర్శించాడు. పురోహితులకు దక్షిణరూపంలో పెద్దమొత్తాలను ఇవ్వద్దని చెప్పాడు. పెండ్లిండ్లకై పెట్టే ఖర్చును ఇతర ప్రజోపయోగకరమైన కార్యక్రమాలకు వెచ్చించడం మంచిదని అభిప్రాయపడ్డాడు. ఈ దురాచారం కేవలం కుటుంబాలకు మాత్రమే పరిమితంగాదని, దీనినొక సామాజిక దురాచారంగా పరిగణించాలన్నాడు. పైగా ఏ శాస్త్రమూ ఈ విధమైన పెండ్లిండ్లకు అనుమతి యివ్వలేదని రుజువులతో నిరూపించాడు. అప్పటి సమకాలీన పత్రికలు, 'కృష్ణాపత్రిక','హిందూ' మొదలగునవి ఈ దురాచారాలను ఖండించాయి. కొందరు మేధావులు ఈ సమస్యపై చిన్న గ్రంథాలు రాసి ప్రజలను విద్యావంతులను చేశారు. దీంతో ప్రజలు వృథాఖర్చులను మానివేసి నిరాడంబరంగా వివాహాలు జరుపుకోనారంభించారు. ఇదే క్రమంలో, వధూవరుల జాతకాలను పరిశీలించే పద్ధతిని వీరేశలింగం విమర్శించాడు. జాతకాలు ఎంతో జాగ్రత్తగా పరిశీలించి, సరైన ముహూర్తం నిర్ణయించి,పెళ్ళిళ్ళు శాస్త్రోక్తంగా జరిపించినా, కొన్ని సందర్భాల్లో వధూవరులు అకాలమరణం ఎందుకు చెందుతున్నారని ఆయన ప్రశ్నించాడు.

వీరేశలింగం కాలంలో ఎవరైనా సముద్రయానం చేస్తే వాళ్ళు తమ కులాన్ని కోల్పోతారన్న ఆచారం అమలులో ఉండేది. సముద్రయానం శాస్త్ర సమ్మతం కాదంటూ దాన్ని అతిక్రమించినవారిని వెలివేశారు. సమాజంలో విద్యావకాశాలు పెరిగి కొత్త వృత్తులను ప్రజలు పాటించడంతో ఇతర దేశాలకు వెళ్ళే అవకాశాలు పెరిగాయి. ముఖ్యంగా, న్యాయవాదవృత్తి చేపట్టేందుకు, న్యాయశాస్త్రాన్ని చదవడానికి ఇంగ్లండుకు కొందరు యువకులు వెళ్ళ నారంభించారు. ఇక్కడ టంగుటూరి ప్రకాశం విషయం ప్రస్తావించుకోవాలి. న్యాయశాస్త్రంలో ఉత్తీర్ణుడై తిరిగి వచ్చాక ప్రకాశాన్ని వెలివేసి ప్రాయశ్చిత్తం చేసుకోమని కులపెద్దలు ఆదేశించారు. వీరేశలింగం అలా చేయొద్దని ప్రకాశాన్ని వారించాడు. ఆయన ఒక విందు ఏర్పాటు చేసి అందరిని ఆహ్వానించాడు. ఇలాగే ఇంకెన్నో విందులు ఆయన గౌరవార్థం ఏర్పాటు కాగా సంప్రదాయ వాదులకు శృంగభంగమైంది. సముద్రయాన నిషేధంపై అప్పటి పత్రికలు ఎన్నో వ్యాసాలు ప్రకటించాయి. మొత్తంమీద 20వ శతాబ్దపు రెండవ దశాబ్దం నాటికి ఈ దురాచారం కనుమరుగు కాసాగింది.

ప్రజాజీవితంలో పెచ్చు పెరుగుతున్న అవినీతిని వీరేశలింగం బట్టబయలు చేశాడు. 'వివేకవర్ధని' పత్రికను దీనికి బలమైన సాధనంగా వాడుకొన్నాడు. న్యాయశాఖలో, ప్రభుత్వపాలక సంస్థల్లో, స్థానిక సంస్థల్లో జరుగుతున్న అవినీతిని నిర్భయంగా తన రచనల ద్వారా, వ్యాసాల ద్వారా బట్టబయలు చేశాడు. న్యాయవ్యవస్థ ప్రజలకు చేరువలో లేదని, వారికి సరైన న్యాయం అందడంలేదని విశ్వసించి మొత్తం న్యాయవ్యవస్థనే సంస్కరించాలన్నాడు. న్యాయాధిపతులను ఒకేచోట ఎక్కువకాలం పని చేయించకూడదని, దానివల్ల వారు అవినీతికి పాల్పడే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయని హెచ్చరించాడు. తన రాతల ద్వారా ఎందరినుండో ప్రమాదం వస్తుందన్న హెచ్చరికలను వీరేశలింగం పట్టించుకోలేదు.

వీరేశలింగం బృహత్ సంస్కరణోద్యమాలతో పాటు, స్థానిక స్థాయిలో ప్రజలెదుర్కొంటున్న దైనందిన సమస్యలపై దృష్టి సారించి వాటికి పరిష్కారాలు కూడా సూచించడం ఆయన నిశితదృష్టికి, ప్రజా సేవాతత్పరతకు నిదర్శనాలు.

# గొంతెండుతోంది

చైతన్య మానవి

సంపాదకీయం...

రాష్ట్రం గొంతెండుతోంది. ఒకవైపు ఎండలు, ఇంకోవైపు తీవ్రమైన కరెంట్ కోతలు. వీటికి రాష్ట్రమంతటా తాగునీటి సమస్య తోడైంది. మనిషి ప్రాణాధారం మంచినీళ్ళు. తిండిలేకుండా కొన్ని రోజులుండగలరేమో కాని, తాగునీరు లేకుంటే కొన్ని గంటలైన వుండలేరు. మనిషి శరీరనిర్మాణంలోనే నీరు ప్రధాన భాగంగా ఉంది.

రాజ్యాంగంలోని 21వ అధికరణం ప్రతి ఒక్కరికి జీవించే హక్కు కల్పించింది. కలుషిత ఆనవాళ్ళు లేని స్వచ్ఛమైన త్రాగునీరు పొందడం ప్రజలందరి ప్రాథమిక హక్కు. తాగడానికి, పాత్రలు శుభ్రంచేయడానికి, బట్టలుతకడానికి, కాలకృత్యాలు తీర్చుకోవడానికి ప్రతి మనిషికి సగటున 135 లీటర్ల నీరు అవసరం.

చిత్తూరు, కడప, అనంతపురం, నల్గొండ, కర్నూలు, ఆదిలాబాదు, మహబూబ్‌నగర్, హైదరాబాదు,రంగారెడ్డి, ఒకటేమిటి అన్ని జిల్లాలూ గుక్కెడు నీటి కోసం అల్లాడుతున్నాయి. మహిళలు మంచినీటికోసం మైళ్ళ దూరం నడవవల్సివస్తోంది. నల్లాల ముందు బారులు తీరిన బిందెలు, అరకొరగా వచ్చే నీటి ట్యాంకర్ల ముందు బిందెడు నీటికోసం జరిగే యుద్ధం సమస్య తీవ్రతను తెలియజేస్తుంది.

భూగర్భ జలాలు మూడొంతులు అడుగంటాయి. బోర్లు వేల సంఖ్యలో చెడిపోయాయి. వాగులు, చెలిమెలు, వ్యవసాయ బావులే ఆధారమైనాయి. పట్టణాలలో 5రోజులకొకసారి నల్లానీళ్ళు. అదికూడా అర్ధరాత్రి, అపరాత్రి సమయపాలన లేకుండా వస్తున్నవి. రాష్ట్రంలో వేలకొలది మంచినీటి పథకాలు వున్నాయి. కానీ తీవ్రమైన కరెంటు కోతతో ఆ ట్యాంకులు నిండవు. ట్యాంకులు నిండకపోతే ఆరోజు గొంతు తడవదు.

గాలి, నీరు, భూమి ప్రకృతి ప్రసాదించిన సహజవనరులు. వీటిని ఉచితంగా పొందే హక్కు ప్రజలందరిది. కానీ సరళీకరణ విధానాల వల్ల నీరు సరుకుగా మారింది. సామాన్యుడి దాహం, అవసరాలు పాలకులకు పట్టకపోగా పెద్దల బొజ్జలు నింపుతున్నారు.

కలుషిత నీటి కారణంగా ప్రత్యేకించి దగ్గు,జలుబు,జ్వరంతోపాటు ఉదర సంబంధిత వ్యాధులు, అతిసార వ్యాధులు వస్తున్నాయి. హైదరాబాద్‌లోని బోలక్‌పూర్‌లో జంతువుల రక్తం, కళేబరాలతో కలుషితమైన నీరు అనేక మంది చిన్నారులను పొట్టన బెట్టుకున్న ఘటన మన కళ్ళముందు ఇంకా మెదులుతూనే ఉంది. "కృష్ణా, గోదావరి ప్రాజెక్టుల నీటిని తరలించి 24గంటలూ నీళ్ళు" అన్న ప్రభుత్వమాట ఊకదంపుడు ఉపన్యాసాలకే పరిమితం అయ్యింది. జీర్ణావస్థలో ఉన్న పైపులైన్ ద్వారా పంపిణీ చేసే నీటిలో 49శాతం లీకేజీల వల్ల వృధా అవుతున్నది.

తీవ్రంగా ముందుకొస్తున్న ప్రజల దాహార్తి సమస్య పరిష్కరించబడాలంటే ప్రభుత్వానికి దీర్ఘకాలిక ప్రణాళిక, ముందస్తు శ్రద్ధ అవసరం. రక్షిత మంచినీటి కోసం బడ్జెట్ కేటాయింపులు పెంచి ప్రభుత్వం యుద్ధ ప్రాతిపదికన చర్యలు చేపట్టాలి.

# చైతన్య మానవి



## సూక్తి

ఏదైనా దురలవాటును వీలైనంత త్వరగా వదిలించుకోకపోతే అది అవసరంగా మారుతుంది

- షేక్స్పియర్




### అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం రాష్ట్ర కమిటీ

చిరునామా:

బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్: 2,1-8-1,

బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ - 500 044.

ఫోన్ : 27605845.

e-mail chaitanyamanavi@gmail.com

సంపాదకులు

టి. జ్యోతి

సంపాదక వర్గం

మల్లు స్వరాజ్యం

అల్లూరి మన్మోహిని

ఎస్. పుణ్యవతి

కె. స్వరూపరాణి

మేనేజర్

ఎం. సుధ

విరాళం రూ : 10/-

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, అజమాబాద్,

హైదరాబాద్ - 500 044.


## ఈ సంచికలో...


1. వ్యాసం
   మహిళా సాధికారత కొన్ని అంశాలు ........ 3
2. జయకేతనాలు
   ముస్లిం సోదరీమణులు ........ 8
3. పుస్తక పరిచయం
   మహిళాచైతన్యంపై మాట్లాడుకుందాం ........ 10
4. కథ
   భోజ్యేషు భర్తా........ 16
5. పోరాట స్ఫూర్తి
   భన్వరీ దేవి........ 18
6. మణిపూసలు
   మాగంటి అన్నపూర్ణాదేవి........ 20
7. సర్వే
   ఆరోగ్యస్థితి సవాళ్ళు - కర్తవ్యాలు ........ 21
8. కథ
   ఆవిడ ........ 24
9. కమిషన్ పేపర్
   ప్రపంచ ఆర్థిక సంక్షోభం........ 28
10. మోటూరు ఉదయం ట్రస్ట్
    మీ సమస్యమాది........ 33
11. స్ఫూర్తి ప్రదాతలు
    లావేటి ఆదెమ్మ........ 36
12. పరిశీలన
    హద్దులు తప్పనిసరి........ 37
13. కథ
    మహిళ - మనిషి - మృగం........ 39
14. చట్టాలు
    హిందూ వితంతు పునర్వివాహ చట్టం........ 41
15. మీడియా
    నేటి నిజం మాట్లాడండి........ 43
16. ఆరోగ్యం
    ఎండతో ఎముకల ఆరోగ్యం........ 44
17. ఉద్యమాల బాటలో ........ 46

వ్యాసం

# మహిళా సాధికారత - కొన్ని అంశాలు

- ప్రభాత్ పట్నాయక్

సాధికారత అనేది ఒక సంక్లిష్టమైన, వివిధ కోణాలతో కూడుకున్న అంశం. కనుక సాధికారతను రకరకాల గణాంక సూచికల ద్వారా తెలిపే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఉదాహరణకు ఇటువంటి సాధారణ సూచిక లింగ నిష్పత్తి సూచిక. సాధారణంగా ఇటువంటి కొలబద్దలపై కొంతమంది అభ్యంతరాలు కూడా లేవనెత్తుతుంటారు. కానీ మనం గమనించాల్సిన అంశమేమంటే ఈ లింగ నిష్పత్తి విషయంలో అనేక దేశాలకంటే భారతదేశం చాలా వెనుకబడివుంది. లింగ నిష్పత్తి సూచిక ద్వారా మహిళా సాధికారత ఎంత కనిష్ట స్థాయిలో వున్నదో మనం నిర్ధారించుకోవచ్చును. కింది పట్టిక ద్వారా భారతదేశ జనాభాలో స్త్రీ పురుష నిష్పత్తిని మనం తెలుసుకోవచ్చును. (1,2 పట్టికలు విభూతీ పటేల్ ప్రచురణ నుండి తీసుకోబడ్డాయి)

పట్టిక-1

| భారతదేశంలో 1901 నుండి 2011 వరకు లింగ నిష్పత్తి | |
|---|---|
| **సం॥** | **ప్రతి 1000 మంది పురుషులకు మహిళల సంఖ్య** |
| 1901 | 972 |
| 1911 | 964 |
| 1921 | 955 |
| 1931 | 950 |
| 1941 | 945 |
| 1951 | 946 |
| 1961 | 941 |
| 1971 | 930 |
| 1981 | 934 |
| 1991 | 927 |
| 2001 | 933 |
| 2011 | 940 |

**(2011లో భారతదేశ జనాభా లెక్కల ఆధారంగా)**

ఈ గణాంకాలు కాలక్రమేణా మహిళల నిష్పత్తి తగ్గడాన్ని సూచిస్తున్నాయి. రోనాల్డ్ ఫిషర్ అనే ప్రముఖ గణాంక వేత్త 1930 సంవత్సరంలో లింగనిష్పత్తిపై ఒక నివేదిక ప్రచురించారు. అనేక జీవ జాతులలోను, మానవ జాతిలో కూడా లింగ నిష్పత్తి 1:1గానే ఉంటుందనేది ఆయన వాదన. ఇంకొంతమంది గణాంకవేత్తల వాదన ప్రకారం జనాభాలో ఆడ, మగ ఇద్దరిపట్ల సమాన శ్రద్ధను పాటిస్తే, జనాభాలో ఆడ, మగ నిష్పత్తి 1.05:1గా ఉండాలి. అందువల్ల కొంతమంది ఆడవారు అదృశ్యమైపోతున్నారని మనం చెప్పవచ్చు. అమర్త్యసేన్ లెక్కల ప్రకారం, ఇలా అదృశ్యమైపోయే ఆడవారి సంఖ్య 6 నుండి 11శాతం వరకూ ఉంటుంది. మహిళలపై ఎంత తీవ్ర వివక్షత ఉందో దీని ద్వారా మనం తెలుసుకోవచ్చు. లింగ నిష్పత్తి విషయంలో ఇతర దేశాలతో భారతదేశాన్ని పోల్చి చూసినపుడు మన దేశంలో సమస్య ఎంత తీవ్రంగా వుందో తెలుస్తుంది.

పట్టిక-2

| వంద మంది పురుషులకు | మహిళల సంఖ్య |
|---|---|
| యూరప్ మరియు నార్త్ అమెరికా | 105 |
| లాటిన్ అమెరికా | 100 |
| కరేబియన్ | 103 |
| సబ్ సహారన్ ఆఫ్రికా | 102 |
| ఆగ్నేయ ఆసియా | 100 |
| మధ్య ఆసియా | 102 |
| దక్షిణాసియా | 95 |
| చైనా | 92 |
| భారతదేశం | 94 |

**మూలం** : న్యూయార్క్‌లో 2010లో ఆర్థిక,సాంఘిక వ్యవహారాల శాఖ నివేదిక నుండి ఈ పట్టిక చూపిన లింగ నిష్పత్తి ప్రకారం మహిళలపట్ల వివక్షత అనేది ఆయా దేశాలలోని పేదరికం పైననో లేక అభివృద్ధిపైననో, లేక ఆర్థిక పరిస్థితిపైననో ఆధారపడి లేదు. ఎందుకంటే ప్రపంచంలోని అతి పేద దేశాలలో ఒకటైన సబ్ సహారన్ ఆఫ్రికాను పరిశీలిస్తే, ఆర్థిక శక్తులుగా ఎదుగుతున్న మరియు జిడిపి అభివృద్ధి రేటు ఎక్కువగా వున్న భారతదేశం,చైనా కంటే ఆ దేశంలోనే లింగ నిష్పత్తిలో మెరుగుదల వున్నది. దీనికి అసలు కారణం ఆసియా సమాజాలలో నెలకొన్న పితృస్వామ్య భావజాలం వలన మగపిల్లలపై మొగ్గుచూపడమే కాక సాంకేతిక

అభివృద్ధితో గర్భంలో వున్న శిశువు లింగ నిర్ధారణ జరిపి ఆడపిల్లల భ్రూణ హత్యలకు పాల్పడుతున్నారు. అంతేకాక చిన్న కుటుంబం వుండాలనే కోరికతోపాటు ప్రభుత్వాలు చిన్న కుటుంబాలు వుండాలని తీసుకొనే విధానాలు కూడా కారణమవుతున్నాయి.

సాధారణంగా జనన నిష్పత్తి బట్టి చూస్తే ఒక ఆడ శిశువుకు 1.05 నిష్పత్తిలో మగ శిశువులు జన్మిస్తారని అంచనా, కాని దీనికి విరుద్ధంగా చైనా మరియు భారతదేశాలలో ఈ రేటు ఇంకా ఎక్కువగా నమోదయ్యింది. 2011లో జనన లింగ నిష్పత్తిని బట్టి చూస్తే పై స్థాయిలో వున్న ఏడు దేశాలలో నిష్పత్తి ఈ క్రింది విధంగా వుంది. ఒక ఆడ శిశువుకు చైనాలో 1.133, ఆర్మీనియా 1.124, భారతదేశంలో 1.12,అల్బేనియాలో 1.118,వియత్నాంలో 1.117, అజర్‌బైజాన్‌లో 1.116 మరియు జార్జియాలో 1.113 మగ శిశువులు వున్నారు.

ఆడ శిశువుల భ్రూణ హత్యలు మరియు ఆడ శిశువుల రక్షణ పట్ల అశ్రద్ధ వహించడం ఇంత ఎక్కువ రేట్లు నమోదవడంలో ప్రధానపాత్ర పోషించాయని అనుమానించవచ్చు. ఇక్కడ గమనించవలసిన ఒక ముఖ్య విషయమేమిటంటే ఒకప్పుడు సోవియట్ యూనియన్‌లో అంతర్భాగంగా వున్న మధ్య ఆసియా రిపబ్లిక్ దేశాలలో సోవియట్ యూనియన్ విచ్ఛిన్నం తరువాత శిశువుల జననలింగ నిష్పత్తిలో బాలుర సంఖ్యలో తీవ్ర పెరుగుదల కనిపించింది. దీనితో జనన లింగ నిష్పత్తి విషయంలో సామాజిక కారణాలు కూడా ప్రముఖ పాత్ర పోషిస్తాయనే విషయం స్పష్టమవుతుంది.

ఇందులో భాగంగా ఇంకొక విషయం పరిశీలిస్తే, భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మహిళలు కొంత సాధికారత సాధించినట్లు కనిపిస్తుంది. అంతకుముందు పురుషులు మాత్రమే వుండే రంగాలలోకి పురుషుల ఆధిపత్యం మాత్రమే వున్న అనేక రంగాలలోకి కూడా మహిళలు ప్రవేశించారు. వాటిని పరిశీలిద్దాం.

65సంవత్సరాల స్వాతంత్ర్యం తరువాత కూడా మన సమాజంలో వున్న పితృస్వామ్య వ్యవస్థను మాత్రం బ్రద్దలు కొట్టలేకపోయాము. ఈ విషయంలో మనం ఒంటరిగా లేము అనే విషయంలో ఏ మాత్రం సందేహం లేదు. ఎంతో అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో కూడా పితృస్వామ్య భావజాలం పట్టుకొనసాగుతున్నది. కాని అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలకూ, భారతదేశం లాంటి దేశాలకూ మధ్య మహిళా సాధికారత విషయంలో కొన్ని మౌళికమైన తేడాలున్నాయి. కనుక ఆ దేశాలలో ఎదుర్కొనే సమస్యల లాంటి వాటితో పాటుగా అదనంగా మనం మరికొన్ని తీవ్ర సమస్యలను ఎదుర్కొనాల్సి వస్తుంది.

అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో అంతకుముందున్న వ్యవస్థను పూర్తిగా ధ్వంసం చేయడం ద్వారా పెట్టుబడిదారీ వ్యవస్థను అభివృద్ధి చేశారు. ఫ్రాన్స్ మరియు ఇంగ్లండ్ దేశాలలో పెట్టుబడిదారులు ఒక విప్లవం ద్వారా రాజ్యాధికారాన్ని చేజిక్కించుకొని పెట్టుబడిదారీ వ్యవస్థను అభివృద్ధి చేశారు. జర్మనీలో

**65సంవత్సరాల స్వాతంత్ర్యం తరువాత కూడా మన సమాజంలో వున్న పితృస్వామ్య వ్యవస్థను మాత్రం బ్రద్దలు కొట్టలేకపోయాము. ఈ విషయంలో మనం ఒంటరిగా లేము అనే విషయంలో ఏ మాత్రం సందేహం లేదు. ఎంతో అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో కూడా పితృస్వామ్య భావజాలం పట్టుకొనసాగుతున్నది. కాని అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలకూ, భారతదేశం లాంటి దేశాలకూ మధ్య మహిళా సాధికారత విషయంలో కొన్ని మౌళికమైన తేడాలున్నాయి. కనుక ఆ దేశాలలో ఎదుర్కొనే సమస్యల లాంటి వాటితో పాటుగా అదనంగా మనం మరికొన్ని తీవ్ర సమస్యలను ఎదుర్కొనాల్సి వస్తుంది.**

అక్కడి పెట్టుబడిదారులు భూస్వాములతో పొత్తు పెట్టుకొని సెమీ ఫ్యూడల్ పెట్టుబడిదారీ వ్యవస్థను స్థాపించారు. పెట్టుబడిదారీ వ్యవస్థకు ముందున్న వ్యవస్థకు పాత ప్రపంచానికి వ్యతిరేకంగా పెద్దయెత్తున ప్రచారం జరిగింది. శ్వేతజాతి ప్రజలు నివసించే అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ మరియు కెనడా లాంటి సమశీతోష్ణ దేశాలకు ఒక కొత్త ప్రపంచంలోకి పెద్ద ఎత్తున ప్రజలు వలసలు వెళ్లే ప్రక్రియ జరిగింది. 19వ శతాబ్దంలో ముఖ్యంగా ఆ శతాబ్ది రెండవ అర్థభాగంలో సుమారు 50 మిలియన్ల యూరోపియన్ ప్రజలు శ్వేత జాతి ప్రజలు నివసించే సమశీతోష్ణ మండలాలకు వలసలు వెళ్ళడమేగాక అక్కడి స్థానిక ప్రజలను వారి భూములకు రైతులుగా మార్చారు.

బ్రిటన్ దేశాన్ని ఉదాహరణగా తీసుకొంటే అక్కడి లెక్కలు ఈ వలసల తీవ్రతను తెలియజేస్తాయి.

1815 సంవత్సరంలో బ్రిటన్‌లోని మొత్తం జనాభా 12 మిలియన్లు కాగా 1815 సంవత్సరం నుండి 1910 సంవత్సరం వరకు బ్రిటన్ నుండి 16 మిలియన్ల జనాభా ఈ కొత్త ప్రపంచంలోకి వలసలు వెళ్ళారు. దీన్ని ఇంకో విధంగా పరిశీలిస్తే, ఆ సంవత్సరాల మధ్య కాలంలో బ్రిటన్‌లోని వలసల సంఖ్య బ్రిటన్‌లోని వార్షిక జనాభా పెరుగుదలలో సగభాగంగా ఉంది. యూరోపియన్ దేశాలలోని పట్టణ ప్రాంతాలలో ఉన్నత స్థాయికి చేరిన పెట్టుబడిదారులు సామ్రాజ్యవాద విధానాలను అనుసరిస్తూ పితృస్వామ్య వ్యవస్థకు పునాదిగా ఉన్న పాత వ్యవస్థను పూర్తిగా అణచివేస్తూ ముందుకు సాగడం ద్వారా ఇంత పెద్ద ఎత్తున వలసలు సాధ్యపడ్డాయి. పితృస్వామ్య భావజాలం కొంత మిగిలివున్నా కాని అది పైపైన మాత్రమే వున్నది. కానీ పితృస్వామ్య వ్యవస్థకు పునాది అయిన పాత ఫ్యూడల్ వ్యవస్థ పతనమైనది.

అందువలన అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో మహిళా సాధికారత విషయంలో రెండు ముఖ్యమైన అంశాలున్నాయి. గతించిన పాత వ్యవస్థ తాలూకు పితృస్వామ్య సాంప్రదాయాలను అధిగమించడం ఒకటైతే పెట్టుబడిదారీ సమాజం మహిళలపట్ల చూపుతున్న వివక్షను అధిగమించడం మరొకటి. రెండవ అంశాన్ని పరిశీలిస్తే ఉదాహరణకు మహిళలకు సమాన పనికి సమాన వేతనం

ఇవ్వకపోవడం మరియు సంక్షోభ సమయాల్లో నిరుద్యోగ సమస్య పెరిగినపుడు మహిళలను పని నుండి తొలగించడం లాంటివి జరిగేవి. మహిళలు కార్మిక శక్తిలో చాలా తక్కువ నిష్పత్తిలో మాత్రమే ఉండేవారు. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో మహిళలు ఈ విధమైన వివక్షతలకు వ్యతిరేకంగా పోరాడారు. చాలా విజయాలు సాధించారు.

మన దేశంలో కూడా ఈ సమస్యలతోపాటు మహిళా సాధికారత విషయంలో మరిన్ని అదనపు సమస్యలు కూడా వున్నాయని మనం గమనంలో వుంచుకోవాలి.

వాస్తవానికి మనదేశం లాంటి చోట్ల ఒకవైపు పెట్టుబడిదారీ వ్యవస్థ తనంతటతానుగా తగిన ఉద్యోగ అవకాశాలు కల్పించలేకపోయింది. ఇంకొకవైపు యూరోపియన్ దేశాల మాదిరిగా పెద్దఎత్తున వలసలు వెళ్ళే పరిస్థితి లేదు. ఈ అంశాన్ని కొద్దిగా ఇతర దేశాలతో పోల్చి చూస్తే, బ్రిటన్ దేశంలో 1815 సంవత్సరం నుండి 1910 సంవత్సరం వరకు వలసలు జరిగిన విధంగా భారతదేశంలో కూడా జరిగి వుంటే, భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుండీ ఇప్పటి వరకు 40 కోట్ల మంది భారతీయులు వలసలు వెళ్లేవారు. ఇది అసంభవమే కాక అవాంఛనీయం కూడా. కనుక భారతదేశం ఒక ఆర్థికశక్తిగా ఎదుగుతున్నదనీ, అభివృద్ధి రేటు ఎక్కువగా వున్నదనీ చెప్పుకుంటున్న ఈ కాలంలో కూడా భారతదేశ కార్మికవర్గంలోని 50శాతం మంది క్షీణ దశలో వున్న వ్యవసాయ రంగంపైనే ఆధారపడి ఉన్నారు.

పెట్టుబడిదారీ వ్యవస్థ ముందు వ్యవస్థకు సంబంధించిన పాతతరం వారు కుల జాడ్యంతోనూ, పితృస్వామ్య భావజాలంతోను మన సమాజంలో కొనసాగుతూ అభివృద్ధి నిరోధకులుగా వున్నారు.

కనుక పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధి చెందినా కాని పితృస్వామ్య భావజాలం పునాదులు సమసిపోలేదు. కనుక మిగిలిన అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో వలే మన దేశం లాంటి చోట్ల పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధితోనే పితృస్వామ్య భావజాలం అంతమవడం సాధ్యం కాదు. కనుక మన దేశంలో పైకి కనిపించే పితృస్వామ్య భావజాలం పైనే పోరాటం చేస్తే సరిపోదు. ఈ భావజాలం మన వ్యవస్థలో అంతర్భాగమే కనుక ఈ వ్యవస్థ పునాదులపైనే మనం పోరాడాల్సిన అవసరం ఉంది.

ఇది అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలకు, భారతదేశం లాంటి దేశాలకు వున్న మొదటి తేడా, రెండవది వ్యవసాయ సంక్షోభం వలన ప్రజలు గ్రామాల నుండి పట్టణాలకు వలసలు వెళుతున్నారు. అలా వలస వెళ్ళిన వారిని కూడా పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధి క్రమంలో తన వ్యవస్థలోకి కార్మికులుగా ఇముడ్చుకోవడం లేదు. కనుక వారు (ఇన్‌ఫార్మల్ సెక్టార్ కార్మికులుగా) చిన్న చిన్న పనులు చేసే క్యాజువల్ కార్మికులు గానో లేక పార్ట్ టైమ్ కార్మికులుగానో మిగిలిపోతున్నారు. భారతదేశంలోని పెట్టుబడిదారీ వ్యవస్థ స్వభావంలో ఇది ఒక ముఖ్యమైన అంశం.

చరిత్రను పరిశీలిస్తే పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి క్రమంలో పాత భూస్వామ్య సమాజాన్ని అంతం చేసే క్రమంలోనే తనకు తెలియకుండానే ఒక కొత్త సమూహాన్ని తయారుచేసింది. ఫ్యాక్టరీలలో కార్మికులుగా నియమించబడిన వారంతా ఒక వర్గంగా మారారు. వారి ముఖ్యమైన లక్ష్యం పని పరిస్థితులు మరియు వేతనాలకై పోరాడడమే అయినప్పటికీ క్రమంగా వారంతా కలసికట్టుగా ఒక వర్గంగా వుండడం కూడా వారి ప్రధాన లక్ష్యంగా మారింది. ఫ్యాక్టరీలలోని ఈ సమూహాలతోనే ట్రేడ్ యూనియన్లు ఏర్పడతాయని కార్ల్ మార్క్స్ గమనించారు. తద్వారా ఒక కొత్త సోషలిస్టు ప్రపంచానికి వారు నాంది పలుకుతారని భావించారు. ట్రేడ్ యూనియన్ స్పృహ కలిగిన కార్మికులే క్రమంగా వర్గ స్వభావం సంతరించుకొని దోపిడీ మొత్తాన్ని అంతం చేయడానికై పెట్టుబడిదారీ సమాజాన్ని కూలదోస్తారని ఆయన విశ్వాసం. కానీ అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో సోషలిస్టు సమాజం స్థాపించబడకపోయినా పని చేసే ప్రజలంతా కూడా పాత సమాజం నుండి అభివృద్ధి చెందిన కార్మికవర్గంగా మారి తెల్లచొక్కా కార్మికులతో సహా ఒక కొత్త సమూహంగా మారారు. వీరు సరికొత్త నీతి నియమాలతో సాంఘిక సహజీవనం సాగిస్తున్నారు.

పెట్టుబడిదారీ సమాజం తనకు తెలియకుండానే ఒక కొత్త వర్గాన్ని తయారుచేసింది. ఆ వర్గం మార్క్స్ ఊహించిన స్థాయిలో అభివృద్ధి చెందకపోయినప్పటికీ ఒక కొత్త సాంఘిక మరియు సామరస్య విలువలతో కూడిన వర్గంగా తయారైంది.

మన దేశంలాంటి దేశాలలో కార్మికులు తాత్కాలిక కార్మికులుగా వుండడంతో వారిని ట్రేడ్ యూనియన్లలోకి సమీకరించడం చాలా కష్టంగా మారింది. ఇంకోవిధంగా చెప్పాలంటే ఇక్కడి పెట్టుబడిదారీ సమాజ అభివృద్ధి మిగిలిన దేశాలలో లాగా కొత్త సామాజిక పొందిక ఏర్పడటానికి అవకాశం లేకుండా చేసింది. అందువలన ఒక కొత్త పొందిక ఆవిర్భవించడానికి అవకాశం లేదు. మన దేశంలో పాత సామాజిక పొందిక నశించనూ లేదు. మరియు కొత్త పొందిక ఆవిర్భవించనూ లేదు. ఒక కొత్త పొందిక బదులుగా పాత సమాజం భావాలతో వుండే కొంత మంది వ్యక్తుల సమూహాలు ఏర్పడ్డాయి. వీరు కార్మికవర్గంలో భాగంగా లేకపోవడం వలన ఎటువంటి కొత్త సామాజిక విలువలూ వీరికి లేకుండా పోయాయి. వీరిని ఇంకో విధంగా చెప్పాలంటే అలగాజనం అని చెప్పవచ్చు. వీరు కార్మికవర్గం కంటే ఎక్కువ సంఖ్యలోనే వున్నారు. పెట్టుబడిదారీ సమాజం ఇంత పెద్ద సంఖ్యలో తయారుచేసే ఈ అలగా జనాన్ని ఆరాచక పెట్టుబడిగా కూడా చెప్పవచ్చు.

భారతదేశంలో ఇప్పుడు అధిక వృద్ధి రేటు వెనుక వేగంగా పెరుగుతున్న ఈ అరాచక పెట్టుబడిని మనం చూస్తున్నాము. నూతన సరళీకరణ విధానాలు నేటి యుగంలో ఫైనాన్స్ పెట్టుబడి ఆధిపత్యాన్ని ఇది ప్రతిబింబిస్తుంది.

నూతన సరళీకరణ విధానాలు ఆరాచక పెట్టుబడిని తయారుచేయడానికి మూడు మార్గాలున్నాయి. మొదటిది ప్రభుత్వ

భారతదేశంలో పెట్టుబడిదారీ సమాజ అభివృద్ధి కార్మికుల సమూహాలతో కలిసి ఒక కొత్తవర్గం ఆవిర్భవించే అవకాశం కలిగించకుండా ఐక్య కార్యాచరణ లేని ఒక అలగా జనాన్ని సృష్టిస్తుంది. అందువలన పాత సమాజంలోని భావజాలానికి భిన్నమైన ప్రత్యామ్నాయ విలువలతో కూడిన ఒక వర్గాన్ని సృష్టించడం ఈ పెట్టుబడిదారీ సమాజం చేయలేకపోతుంది. ఇటువంటి పెట్టుబడిదారీ సమాజాన్ని అరాచక పెట్టుబడిదారీ సమాజం అని చెప్పవచ్చు.

రంగాన్ని నిర్వీర్యం చేయడం, రెండవది వస్తూత్పత్తి రంగాలను తగ్గించడం, మూడవది మార్క్స్ చెప్పిన విధంగా పెట్టుబడి పోగుబడేట్లు చేయడం (అవినీతి దీని ఫలితమే). ఈ మూడు మార్గాలను పరిశీలిద్దాం.

సాధారణంగా ప్రభుత్వరంగాన్ని ఆర్థిక కోణంతోనే చూస్తాము. కానీ అది ఒక ప్రాథమిక సామాజిక పాత్రను పోషిస్తుంది. ఎందుకంటే ప్రభుత్వరంగ కార్మికులు పెట్టుబడిదారులు నియమించే కార్మికుల కంటే ఎక్కువగా యూనియన్లలో సంఘటితమవుతారనేది వాస్తవం. ఆ విధంగా సామాజికంగా కూడా పెద్దఎత్తున సంఘటితమయ్యే ఆచారాన్ని వారు కొనసాగిస్తారు. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో ఈ రోజుకు కూడా ప్రయివేటు రంగంలో పనిచేసే కార్మికులు 7శాతం మంది మాత్రమే యూనియన్లలో వున్నారు. అదే ప్రభుత్వరంగంలో చూస్తే 33శాతం మంది కార్మికులు (టీచర్లు తెల్లచొక్కా కార్మికులతో కలసి) యూనియన్లలో వున్నారు.

ఫ్రాన్స్ దేశం ఉదాహరణను చూస్తే మిగిలిన అభివృద్ధి చెందిన దేశాలలో ట్రేడ్ యూనియన్ల బలం తగ్గినప్పటికీ ఫ్రాన్స్‌లో ట్రేడ్ యూనియన్లు బలంగా వున్నాయి. ఎందుకంటే ఫ్రెంచ్ ఆర్థిక వ్యవస్థలో బలమైన ప్రభుత్వరంగం ఉండడం వలననే. కనుక నూతన సరళీకరణ విధానాల ద్వారా ప్రభుత్వరంగాన్ని బలహీన పరచడమంటే మొత్తంగా ఆర్థిక వ్యవస్థలో ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని బలహీనపరచడమే అవుతుంది. ఫలితంగా మతాతీతమైన లౌకిక విలువలతో కూడి వున్న ఒక ప్రత్యామ్నాయ కొత్త వర్గాన్ని నిరోధించడమే అవుతుంది.

ఆధునిక తయారీరంగం పెద్ద సంఖ్యలో కార్మికులు కలిసి పనిచేసేలా చేస్తుంది. దీనితో వారు తమ హక్కుల కోసం ఐక్యంగా పోరాడేందుకుగానూ ఒక కొత్త సాంప్రదాయంగల సమూహంగాను తయారవుతారు. కానీ ఈ రోజుల్లో తయారీరంగంలో ఉత్పత్తి క్రమాన్ని విడగొట్టి కొంత భాగాన్ని గృహ కార్మికులకు అప్పజెపుతున్నారు. అయినా కూడా తయారీరంగంలో పెద్దపెద్ద యూనిట్లలో అనేకమంది కార్మికులు ఒకే దగ్గర కలిసి పనిచేయడం తప్పనిసరిగా వుంటుంది. భారతదేశంలో అధిక అభివృద్ధి జరుగుతున్నదని చెప్పుకుంటున్న ఇటీవలి కాలంలో కూడా ఒకవైపు వ్యవసాయ రంగంలో అభివృద్ధికుంటుపడగా, మరోవైపు తయారీ రంగంలోని అభివృద్ధి కూడా సరళీకరణ విధానాల కంటే ముందు కాలమైన 50, 60 దశకాలలోని నెహ్రూ కాలం నాటి అభివృద్ధికంటే తక్కువగానే వున్నది. వాస్తవానికి సేవల రంగంలో వేగంగా అభివృద్ధి జరిగింది. ఈ రంగంలో ఎక్కువ మంది కార్మికులు అసంఘటితంగా వున్నారు. వీరు యూనియన్లలో చేరే అవకాశం తక్కువ. అంతేకాక సంఘటిత రంగంలో కూడా బహుళజాతి కంపెనీల ఆధిపత్యం వలననూ ఎగుమతుల మార్కెట్‌కు అనుకూలంగా అందులోని కార్మికులు పనిచేయాల్సి వున్నందువలననూ అక్కడ యూనియన్లు ఏర్పాటుచేసే అవకాశాలు లేవు. సర్వీసు రంగంతోపాటు స్పెక్యులేషన్ (సట్టా) వ్యాపారం వలన కూడా అభివృద్ధి పెరిగినట్లు కనిపిస్తుంది. రాత్రికి రాత్రే ధనవంతులను సృష్టించే ఈ రంగాన్ని నడిపించే వ్యక్తులు రాజకీయ వ్యవస్థలోని అవినీతికి ఒక వనరుగా ఉపయోగపడుతున్నారు. తేలికగా డబ్బు సంపాదించాలనుకునే వ్యక్తులు స్పెక్యులేటివ్ (సట్టా) వ్యాపారంలోనే కాక మిగిలిన సేవల రంగంలోకి కూడా విస్తరించారు. ఉదాహరణకు రవాణా రంగాన్ని ప్రయివేటీకరించిన తరువాత ఆ రంగంలోకి అనేకమంది అవినీతిపరులు, నేర చరిత్ర ఉన్నవాళ్ళు కూడా ప్రవేశించారు. స్థానిక రాజకీయ నాయకులతో వీరికి పరస్పర సహకారం ఉంటుంది. కనుక వారి అండదండలు వీరికి ఉంటున్నాయి.

అవినీతికి మూలకారణం పెట్టుబడి కేంద్రీకరించబడుతున్న క్రమమే. ప్రభుత్వ ఆస్తులనుగానీ, కమ్యూనిటీకి చెందిన ఆస్తులనుగానీ ప్రయివేటు వ్యక్తులు లీజు రూపంలోనో, పాట రూపంలోనో చేజిక్కుంచుకుంటున్నారు. పాలకపక్షంలోని అవినీతి పరులైన రాజకీయ నాయకులకు, అధికారులకు కొంత డబ్బు వాటాగా ముట్టజెప్పి ప్రయివేటు వ్యక్తులు ఈ విధంగా ఆస్తులు చేజిక్కించుకుంటున్నారు. ఈ విధంగా పాలకపక్షంలోని రాజకీయ నాయకులు, అధికారులు అవినీతి సొమ్ము పొందుతూ వ్యాపార వర్గాలకు (బూర్జువాలకు) ఆస్తులు చేజిక్కించుకొనే అవకాశాలు కల్పిస్తూ పెట్టుబడి కేంద్రీకరణకు దోహదపడుతున్నారు. ఇది పాలకవర్గంలోని రాజకీయ నాయకులు నూతన సరళీకరణ విధానాలతో మమేకం కావడానికి దారి తీస్తుంది. తరువాత నిర్ణయాధికారం కూడా వీరి చేతిలో నుండి ఈ కొత్త బ్యూరోక్రాట్‌లు సాంకేతిక నిపుణుల చేతిలోకి వెళుతుంది. వీరు ప్రపంచవ్యాప్త ఫైనాన్స్ పెట్టుబడికి అనుకూలంగా వ్యవహరిస్తుంటారు. (సాధారణంగా వీరు ప్రపంచబ్యాంకు, ఐ.ఎం.ఎఫ్, మరియు బహుళజాతి బ్యాంకుల ఉద్యోగులై వుంటారు).

ఈ మొత్తం క్రమాన్ని పరిశీలిస్తే, భారతదేశంలో పెట్టుబడిదారీ సమాజ అభివృద్ధి కార్మికుల సమూహాలతో కలిసి ఒక కొత్తవర్గం ఆవిర్భవించే అవకాశం కలిగించకుండా ఐక్య కార్యాచరణ లేని ఒక అలగా జనాన్ని సృష్టిస్తుంది. అందువలన పాత సమాజంలోని భావజాలానికి భిన్నమైన ప్రత్యామ్నాయ

విలువలతో కూడిన ఒక వర్గాన్ని సృష్టించడం ఈ పెట్టుబడిదారీ సమాజం చేయలేకపోతుంది. ఇటువంటి పెట్టుబడిదారీ సమాజాన్ని అరాచక పెట్టుబడిదారీ సమాజం అని చెప్పవచ్చు. ఆధునిక పెట్టుబడిదారీ దేశాలలో కూడా ఈ ప్రాబల్యంతో ఏర్పడేదే ఈ అరాచక పెట్టుబడిదారీ సమాజం. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో కూడా ఈ ప్రాబల్యం యొక్క ఫలితాలు ఈ విధంగానే వున్నాయి. అక్కడ కూడా ఆర్థిక, రాజకీయ రంగాలలో ట్రేడ్ యూనియన్లు మరియు కార్మిక వర్గ ప్రభావం తుగ్గుముఖం పట్టింది. కానీ ఆదేశాలలో గత చరిత్ర నుండి వస్తున్న ట్రేడ్ యూనియన్ సాంప్రదాయం మరియు కార్మికవర్గ రాజకీయాలతో సాంఘిక నిర్మాణానికి మన దేశంలాంటి దేశాలలోలాగా పెద్దగా నష్టం వాటిల్లలేదు. ఈ వాదనను నేను ఈ క్రింది అంశంతో ముగిస్తున్నాను.

భారతదేశంలో పెట్టుబడిదారీ సమాజ అభివృద్ధి క్రమం మిగిలిన దేశాలకంటే భిన్నంగా జరిగింది. మిగిలిన దేశాలవలే ఇక్కడ పితృస్వామ్య మరియు కుల వ్యవస్థతో కూడుకొని వున్న పాత వర్గాన్ని విచ్ఛిన్నం చేయడంగానీ, ఆ పాతవర్గం స్థానంలో ఒక కొత్తవర్గం యొక్క సృష్టిగానీ జరగలేదు. అందువలననే మన దేశంలో ఒక వైపు ఖాప్ పంచాయితీల వర్గం మరోవైపు అదే రీతిలో వున్న అలగా జనం కనిపిస్తున్నారు.

ఈ విషయాలన్నింటికీ, మహిళా సాధికారతకు సంబంధమేమిటనే ప్రశ్న ఉదయించవచ్చు, వ్యవస్థలోని వలసవాద దోపిడీకి వ్యతిరేకంగా జరిగే పోరాటాలలో మహిళా సాధికారత అంశం కూడా ఒక భాగమే. కానీ మన సమాజంలో పితృస్వామ్య భావజాలంతోవున్న పాతవర్గం కొనసాగడం వలననూ మరియు సమాజంపట్ల ముఖ్యంగా మహిళల పట్ల నేర మనస్తత్వం కలిగివుండే ఆరాచక జనం పెద్ద ఎత్తున పెరగడం వలననూ మహిళా సాధికారతకై జరిగే కృషి వెనుకపట్టుపట్టింది. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన వెంటనే మొత్తం సమాజ విముక్తికై ముందుకు వచ్చిన వలసవాద వ్యతిరేక పోరాటాలకు వ్యతిరేకంగా ప్రచారం మొదలైంది. దీని ప్రభావం అన్ని రంగాలతోపాటు మహిళా సాధికారతపై కూడా పడింది.

ఇంతేకాక ఒకవైపు పాతవర్గాన్ని విచ్ఛిన్నం చేయలేకపోవడం మరొకవైపు కొత్త వర్గాన్ని నిర్మించలేని బలహీనత, ఈ రెండు లక్షణాల మధ్య ఒక గతితార్కిక సంబంధం ఉన్నది. పితృస్వామ్య ఆధిపత్యాన్ని ఎదిరించి పట్టణ ప్రాంతాలలో అనేక రంగాలలో ముందుకు పోతున్న మహిళలపైన వారి హక్కులపైనా వారి గౌరవంపైనా ఈ అరాచకశక్తులు దాడులకు తెగబడుతున్నాయి. మహిళలను పితృస్వామ్య ఆధిపత్యంలోనే అణచిపెట్టాలని, వారి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను హరించాలనే పట్టుదలతో ఈ అరాచక శక్తులు పనిచేస్తుంటాయి. ఢిల్లీలో ఈ మధ్య ఒక యువతిపై జరిగిన దారుణ అత్యాచారం, హత్య ఘటనను దీనికి దృష్టాంతంగా మనం చూడవచ్చు. నిజానికి ఈ నేరానికి పాల్పడిన దుండగులకు మరణశిక్ష విధించాలని డిమాండ్ చేసిన నిరసన కారులలో చాలా మంది వాదన పితృస్వామ్య ఆధిపత్యానికి ఊతమిచ్చేలా ఉంది. వారి వాదన ప్రకారం అత్యాచారానికి గురైన మహిళ బ్రతికినా కూడా ఒక జీవచ్ఛవం లాంటిదేనని ఒక సీనియర్ మహిళా రాజకీయవేత్త కూడా ఇదే భావనను వ్యక్తీకరించారు.

మహిళా సాధికారత అనే బృహత్కార్యాన్ని సాధించాలంటే సమాజంలోని ఈ మూలాలపై పోరాడాల్సి వుంది. రాజకీయ వ్యవస్థలోని పోరాట వ్యతిరేక భావజాలం మహిళా సాధికారత సాధనకై జరిగే పోరాటాన్ని నిరుత్సాహ పరచకూడదని నా భావన. మనదేశంలో మహిళా సాధికారత అనేది మొత్తం ప్రజల విముక్తితో ముడిపడి వున్నదనేది ఈ సందర్భంగా నేను చెప్పదలచుకొన్నాను. ఆ సమస్యపై పోరాడుతూనే దాని మూలాలను కూడా గమనంలో వుంచుకోవాలి. నిజానికి మహిళా విముక్తికై సాగించే పోరాటం మిగిలిన ఇతర పోరాటాలతో కలిసి చేసినపుడు మరింత బలపడుతుంది.

మహిళా విముక్తికై పోరాటాలు జరిగినపుడే కులపరమైన అణచివేతపై జరిగే పోరాటం విజయవంతమవుతుందని మా యూనివర్శిటీకి చెందిన చరిత్రకారిణి సువీర జైస్వాల్ వాదన. దీనిని ఇంకో విధంగా కుల దురహంకారంపై పోరాడుతూనే మహిళా విముక్తికై పోరాటాలు జరిపినపుడు అవి జయప్రదమవుతాయని కూడా చెప్పవచ్చని నేను భావిస్తాను.

భారతదేశం లాంటి దేశాలలో నూతన సరళీకరణ విధానాల విషవలయం వలన మహిళా సాధికారత క్రమం వెనుకపట్టు పడుతున్నది. కనుక ఒక విశాల వేదిక ద్వారా పోరాట క్రమాన్ని కొనసాగించినపుడు మాత్రమే మహిళా సాధికారత విషయంలో మనం ముందడుగు వేయగలుగుతాము.

●

**-అనువాదం. కె.నాగలక్ష్మి.**

**వాస్తవానికి మనదేశం లాంటి చోట్ల ఒకవైపు పెట్టుబడిదారీ వ్యవస్థ తనంతటతానుగా తగిన ఉద్యోగ అవకాశాలు కల్పించలేకపోయింది. ఇంకొకవైపు యూరోపియన్ దేశాల మాదిరిగా పెద్దఎత్తున వలసలు వెళ్ళే పరిస్థితి లేదు. ఈ అంశాన్ని కొద్దిగా ఇతర దేశాలతో పోల్చి చూస్తే, బ్రిటన్ దేశంలో 1815 సంవత్సరం నుండి 1910 సంవత్సరం వరకు వలసలు జరిగిన విధంగా భారతదేశంలో కూడా జరిగి వుంటే, భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుండీ ఇప్పటి వరకు 40 కోట్ల మంది భారతీయులు వలసలు వెళ్లేవారు. ఇది అసంభవమే కాక అవాంఛనీయం కూడా. కనుక భారతదేశం ఒక ఆర్థికశక్తిగా ఎదుగుతున్నదనీ, అభివృద్ధి రేటు ఎక్కువగా వున్నదనీ చెప్పుకుంటున్న ఈ కాలంలో కూడా భారతదేశ కార్మికవర్గంలోని 50శాతం మంది క్షీణ దశలో వున్న వ్యవసాయ రంగంపైనే ఆధారపడి ఉ[illegible]**

జయకేతనాలు

# పేరు ప్రఖ్యాతులు గడించిన ముస్లిం సోదరీమణులు

- వేములపల్లి సత్యవతి

26 జనవరి1950లో మనదేశపు సర్వోన్నత న్యాయస్థానం ఏర్పడింది. సర్వోన్నత న్యాయస్థానంలో న్యాయవాదిగా ప్రథమంగా అడుగుపెట్టిన మహిళామణి (ముస్లిం) మీరా సాహెబ్ ఫాతిమాబీ.

**అక్బరీబేగం.**

ఆధునిక ముస్లిం మహిళా కవయిత్రి అక్బరీబేగం. భర్త ఉమర్ ఆలీషా సుప్రసిద్ధుడైన సూఫీకవి. బేగంకు మరో ప్రత్యేకత కూడా ఉంది. మాతృభాష ఉర్దూలో కాకుండా తెలుగులో కూడా కవిత్వం రాసిన ప్రతిభావంతురాలు. 1903లో బేగం కవిత "హిందూ సుందరి" అనే తెలుగు పత్రికలో "అపూర్వ పతివ్రతాచరిత్ర"ము అన్న శీర్షికన ఆమె రాసిన కవిత అచ్చయింది.

ఉమర్ఆలీషా, అక్బరీబేగం దంపతులు సూఫీ సిద్ధాంతాలను అంకితభావంతో ప్రచారం చేశారు. ఉమర్ ఆలీషా రచించిన సూఫీ కావ్యం"సూఫీవేదాంత దర్శనం" ఆ కావ్యాన్ని భార్య అక్బరీబేగానికి అంకితమిచ్చాడు. ఆలీషా తన భార్య గొప్ప పండితురాలు, విమర్శకురాలని, తన కావ్యాలన్నింటికి ఆమే ప్రథమ పఠిత అని అనేవాడు. అక్బరీబేగంకు విశ్వకవి రవీంద్రునితోను, భారత కోకిలగా పేరుగాంచిన సరోజనీనాయుడుతోను సన్నిహిత సంబంధాలుండేవి. వారిని కలుస్తూఉండేది. 1935లో అక్బరీబేగం ఢిల్లీలో మరణించింది. ఆమె మృతికి సంతాపసూచకంగా ఢిల్లీ శాసనసభకు ఆరోజు సెలవు ప్రకటించారు.

**బేగం హుమాయూన్ మీర్జా**
**(1882-1958)**

ఇస్లాం మతపరమైన కట్టుబాట్లను, ఆత్మగౌరవ పరిరక్షణ కొరకు ఎదిరించి పోరాడిన ధీర మహిళ బేగం మీర్జా. తల్లి భాషలోనే విద్యాబోధన జరగాలని, పర్దా వ్యతిరేక ఉద్యమాలు నడిపిన సారథులలో తొలితరానికి చెందిన మహిళ బేగం హుమాయూన్ మీర్జా. మీర్జా పలు పత్రికలను స్వీయ సంపాదకత్వాన నిర్వహించిన ధీరోదాత్తురాలు. "ముషీర్-ఎ-నిశ్వాన్(స్త్రీలమార్గదర్శి) 'అనిల్‌సా' (స్త్రీ) 'ఔబున్నీసా' (స్త్రీరత్నం) అనే మహిళా పత్రికలను ప్రచురించారు. మీర్జా కవయిత్రికూడ. 'హేయ్' అన్న కలంపేరుతో కవితలు రాశారు. సాహిత్యరంగంతోపాటు, రాజకీయ రంగంలో కూడా ప్రవేశించారు. సరోజనీనాయుడు మొదలగు రాజకీయ నేతలతో మీర్జాకు సంబంధాలు వుండేవి.

**అమీనా నక్వీ.**

నిజాంపాలనలోని హైదరాబాద్ ఉన్నత న్యాయస్థానంలో తొలి మహిళా న్యాయవాదిగా పనిచేసిన ముస్లిం మహిళ అమీనా నక్వీ. న్యాయవాదిగా పనిచేస్తూ పదోన్నతిపై పబ్లిక్ ప్రాసిక్యూటరుగా నియమించబడిన ప్రథమ మహిళ కూడా అమీనా నక్వియే. తర్వాత చీఫ్ పబ్లిక్ ప్రాసిక్యూటరుగా పదోన్నతిలో వుండగా పదవీ విరమణ చేశారు. ఈ రెండు పదవులను ఆమె ముంబయి మహానగరంలో నిర్వహించారు. పదవీ విరమణ తర్వాత హైదరాబాద్ వచ్చారు. 1954-56లో ఉస్మానియా యూనివర్శిటీ సెనేట్ సభ్యురాలుగా నామినేట్ చేయబడ్డారు. ఆల్ ఇండియా విమెన్స్ కాన్ఫరెన్స్. ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ, గిల్డ్ ఆఫ్ సొసైటీవంటి అనేక సంస్థలలో పనిచేసి సేవలందించారు.

**షాజహానా**

హైదరాబాదు నివాసి, మైనార్టీల ముస్లిం మహిళల స్త్రీవాద కవయిత్రిగా వర్తమానకాలంలో ప్రసిద్ధి చెందారు. హైందవంలో చతుర్వర్ణ వ్యవస్థ వున్నట్లుగానే ఇస్లాంలోను షియా, సున్నీ, షేక్, పఠాను, దూదేకులవారు వున్నారు. హైందవంలో దళితులు అన్ని వర్ణాలవారికంటే తక్కువ చూడటం జరుగుతున్నట్లుగానే ఇస్లాంలో దూదేకులవారు మిగతా వారికన్న తక్కువ వారిగా చూడబడుచున్నారు. షాజహానాగారి కలం నుంచి దూదేకుల, ముస్లింమహిళల, మైనార్టీల గురించి స్త్రీవాద కవితలు చాలా వేడిగా వాడిగా , పదునుగా, ఘాటుగా సాగినవి. షాజహానా గారి మాతృభాష తెలుగు కానప్పటికి కవితలు, రచనలు తెలుగులోనే రచించబడినవి. మాతృభాషీయులైన తెలుగువారికంటే ఏమాత్రం

తక్కువగాకుండా తెలుగులో రచనలు చేస్తున్న ప్రతిభావంతురాలు షాజహానా.

"నకాబ్' (బురఖా) వారికలం నుంచి జాలువారిన అద్భుతమైన, విశిష్టమైన కవితా సంకలనం. 'నకాబ్' షాజహానాగార్కి ఎనలేని కీర్తి ప్రతిష్టలు తెచ్చి పెట్టింది. ఆ కవితాసంపుటి, జర్మనీ, ఫ్రెంచి, ఇంగ్లీషు మొదలగు భాషల్లో అనువదింపబడినవి. జర్మనీ సాహిత్యాభిమానుల ఆహ్వానంపై జర్మనీ వెళ్లి పర్యటించివచ్చారు. మత ఛాందసుల మౌఢ్యంవలన పుట్టి పెరిగిన రచయిత్రి బంగ్లాదేశ్‌లో వుండే అవకాశాలు లేక, స్థిరంగా ఏదేశంలోను వుండే పరిస్థితులు లేక అల్లాడుతున్న ప్రపంచ ప్రసిద్ధిగాంచిన తస్లిమాకు ప్రేమతో కవిత రాసి ఆమెకు అంకితమిచ్చారు షాజహానా. రెండవ కవితా సంకలనం దర్దీ (బాధ) నొప్పి ఆవిష్కరణ జరిగింది. 'నకాబ్' కు, 'దర్దీ' కవితా సంపుటాలలో భిన్నత్వం వుంది. మహిళల వేరువేరు మానసిక బాధలు 'దర్దీ' లో దర్శనమిస్తాయి. మనసుమారనిరంగు, సాజనమావి, ఆరణ్య, పాటగాడు, చమ్కీ వారికలం నుంచి వెలువడిన ఆణిముత్యాలు. ఏకధారగా తెలంగాణాయాసలో రచించబడినది. 'తెల్లారనిబతుకు' వారి వైవిధ్యభరితమైన స్త్రీవాద రచన. మరిన్ని రచనలు, కవితలు ఆమె కలం నుండి వెలువడాలని ఆశిద్దాం.

**షబ్నంహష్మి**

మతవివక్షత పోరాటయోధురాలు షబ్నంహష్మి. హిందూ-ముస్లిం మత ఛాందస శక్తులకు వ్యతిరేకంగా 30 సంవత్సరాలనుండి అలుపెరుగని పోరాటం చేస్తున్నది. చాలా శక్తివంతురాలయిన సామాజిక ఉద్యమకారిణి. లౌకికవాదం, ప్రజాస్వామికం, మానవహక్కుల పరిరక్షణే హష్మి ధ్యేయం. కొంతమంది ప్రముఖులతో కలిసి 'సహమత్' అనే స్వచ్ఛంద సంస్థను 2003న స్థాపించింది. ఆ సంస్థ ద్వారా శాంతి, సామరస్యం, మానవ హక్కులకోసం నిరంతర పోరాటం చేస్తూనే వున్నది. ఆయోధ్య, గుజరాత్ అల్లర్ల సమయంలో అక్కడకు వెళ్లి మైనార్టీల పరిరక్షణ కొరకు పాటుపడింది.పలు సందర్భాలలో ఆమెపై దాడులు జరిగాయి. భయపడలేదు. వెనకడుగువేయలేదు. ఏడు సంవత్సరాలనుంచి గుజరాత్‌లో ఎక్కువ సమయం పనిచేస్తున్నది.



2012 గుజరాత్‌లో మోడీ మూడవసారి విజయానికి నిరసనగా అయిదు ప్రభుత్వ ప్యానెళ్ల సభ్యత్వానికి 28 డిసెంబర్, 2012లో రాజీనామా చేశారు. సమానత్వం కోసం ఆయుధాలు చేతబట్టి ప్రజలు ఒకరినొకరు చంపుకోవటాన్ని ఖండించింది. తన మతం తప్ప ఇతరుల మతాలు చెడ్డవని చెప్పటం, కించపరచడం, అపహాస్యం చేయటం షబ్నం సహించదు. మతద్వేషాలను రెచ్చగొట్టేవారు హిందువులయినా, ముస్లింలయినా 153 ఎ సెక్షన్ ప్రకారం జైలుకు వెళ్లవలసిందేనని కుండబద్దలు కొట్టినట్లు చెప్పింది. హైదరాబాదుకు చెందిన ముస్లిమ్ ఎమ్ఎల్ఏ అక్బరుద్దీన్ ప్రసంగాలను కరాఖండిగా ఖండించింది. హిందూ తొగాడియాలాంటి వాడని అక్బరుద్దీన్‌ను గురించి వ్యాఖ్యానించింది. అక్బరుద్దీనయినా, మోడీ అయినా, తొగాడియా, గడ్కరీ, అద్వానీలలాంటివారు ఎవరైనా విద్వేషాలను రెచ్చగొట్టే విధంగా ప్రోత్సహిస్తే జైలుకు తప్పక పంపవలసిందేనని తేల్చింది. 'నేషనల్ మైనార్టీ అవార్డు' అందుకుంది. ఎన్నో సత్కారాలు పొందింది. 2005లో నోబెల్ శాంతి బహుమతికి ప్రతిపాదించిన వెయ్యిమంది పేర్లలో షబ్నంహష్మి పేరుకూడా వుంది. శాంతి, సామరస్యం, లౌకికవాదం, ప్రజాస్వామ్యం, మానవహక్కుల కొరకు గాంధీజీ లా అహింసా మార్గంలో



పయనిస్తానంది. పరమత సహనానికి పాటు పడుతున్న హష్మీకి మన మందరం సహకరిద్దాం.

**శిరీన్ ఇబాదీ.**

ఇబాదీ కూడ ఇరాన్ దేశీయురాలే. న్యాయవాదిగా పనిచేస్తున్నది. ఇస్లాం మత ప్రాతిపదికన ఏర్పడిన గల్ఫ్ దేశాలలో మహిళలకు, మానవహక్కులకు తావులేదు. ఇరవయ్యోకటవ శతాబ్దంలో కూడ ఒక్క సినిమా థియేటర్ కూడ లేని అత్యంత సంపన్న దేశం సౌదీ అరేబియా. సౌదీ అరేబియాలో మహిళలు కారు నడుపకూడదు. మత ఛాందస రాజ్యం ఇరాన్‌లో మానవ హక్కుల కొరకు అవిశ్రాంత పోరాటంచేస్తున్న ధీర మహిళా న్యాయవాది శిరీన్ ఇబాదీ. అంతేకాదు. ప్రపంచంలో నోబెల్ బహుమతి పొందిన ప్రథమ ముస్లిం మహిళ కూడ శిరీన్‌ఇబాదీయే. మహిళల హక్కుల పోరాట యోధురాలయిన ఇబాదీకి హృదయ పూర్వక అభినందనలు అందజేస్తూ ఆమె కృషి సఫలీకృతమవ్వాలని కోరుకుందాం.

**తరువాయి భాగం 15వ పేజీలో**

పుస్తక పరిచయం

## మహిళా చైతన్యంపై

# మాట్లాడుకుందాం రండి..!

- యు.వాసుకి.

మహిళా చైతన్యం అంటే ఇత్తడి, కంచు లాంటి లోహం గురించినది కాదు. అది ఒక విద్య, పరిశోధన, ఆచరణ. మహిళా హక్కులకు సంబంధించిన దృక్పథం. 'ఆడవాళ్ళు ఇలాగే ఉండాలి' అనే అభిప్రాయాన్ని సవాలు చేసేదే మహిళా చైతన్యం. అది పురుషాధిక్యతను ధిక్కరిస్తుంది.

సాధారణంగా సినిమా చూసేందుకు వెళ్ళేవారు రకరకాలైన వారుంటారు. అందరి మనస్సుల్లోనూ ఏవేవో ఊహలు, భావాలు గజిబిజిగా గందరగోళపరుస్తుంటాయి. వాటితోపాటు సినిమా చూస్తున్నప్పుడు అందులో ఎన్నో అంశాలు వస్తున్నప్పటికీ ప్రతి ఒక్కరూ వారి, వారికి అత్యంత దగ్గరయిన అంశాలను మాత్రమే ఆ సినిమాలో ప్రధానంగా గమనిస్తారు. 'నేనప్పుడే అనుకున్నాను ఇలాగే అవుతుంది'అని ప్రతి ఒక్కరూ ప్రకటించేస్తారు. ఎవరైనా ఒక పురుషుడు భార్య మీద ఆగ్రహంతో ఉండి సినిమా చూస్తున్నప్పుడు ఆ సినిమాలో రజనీకాంత్ తన భార్య అయిన రమ్యకృష్ణను పాట పాడుతూ కొరడాతో బాదుతున్నప్పుడు ఆ దృశ్యం చూసి మన ప్రేక్షక మహాశయుడు ఆనందంతో ఉద్రూతలూగుతాడు. తనకు తెలియకనే 'శభాష్ రజనీ....! అని అరిచేస్తాడు కూడా. స్త్రీలను చూడటం, వారితో మాట్లాడటం, వారితో ఆరోగ్యకరమైన స్నేహం చేయటంలాంటి అలవాట్లు లేని మనఃస్థితిలో ఉన్నవారు సినిమాల్లో వచ్చే అర్థనగ్న దృశ్యాలను చూసి తమను తాము మరచిపోతారు. పిల్లలు సినిమాల్లోని ఫైట్ దృశ్యాలను మాత్రమే బాగా వంట పట్టించుకుంటారు. థియేటర్ నుండి బయటకు వచ్చిన తరువాత కూడా ఇతర పిల్లలతో ఫైట్లు చేస్తుంటారు. తమ అభిమాన హీరో చూపే అర్థం, పర్థం లేని 'స్టైళ్ళను' ప్రదర్శిస్తూ కేరింతలు కొడుతుంటారు. అయితే మహిళా ఉద్యమాలకు సంబంధించిన స్త్రీలు సినిమాలు చూస్తున్నప్పుడు తమ భావజాలానికి వ్యతిరేకమైన దృశ్యాలేమైనా అందులో ఉన్నాయా అని కళ్ళు పెద్దవి చేసి చూస్తారు. 'ఇదేంటీ, ఎనిమిదో తరగతి అమ్మాయికి అప్పుడే పెళ్ళి చేసేస్తున్నారు. వయస్సు రీత్యా ఎదగని, మానసికంగా వికసించని పసి అమ్మాయికి బలవంతంగా పెళ్ళి చేయటం ఎంత వరకూ సమంజసమని ఆ డైరెక్టర్‌ను అడగాలనిపిస్తుంది. తమ ఖజానాలను నింపుకునేందుకు విరిసీ, విరియని వయస్సులో ఉన్న అబ్బాయిలను, అమ్మాయిలను ప్రేమింపచేసి, ఆ దృశ్యాలను రంగు, రుచులతో తెరమీదకెక్కించే నిర్మాతలను, డైరెక్టర్లను నిలదీయాలనిపిస్తుంది. ఒక సినిమా మొత్తం దౌర్జన్యాలతో, హింసా దృశ్యాలతో, రక్తపు ప్రవాహాలతో ఉన్నా, జుగుప్స కలిగించే నగ్న దృశ్యాలతోనూ, భంగిమలతోనూ, రెండర్థాల సంభాషణలతోనూ ఉన్నా మన గౌరవనీయులైన సెన్సార్ బోర్డు సభ్యులకు అదేమి కనికట్టో గానీ కనబడనే కనబడవు. అయితే చిత్రం చివరలో హీరో 'ఇందుకే నేను మొదట్నుంచీ హింసా చర్యలు పనికిరావు అహింసను పాటించాలని చెబుతున్నాను' అన్న వాక్యంతో సినిమా ముగియగానే మన సెన్సార్ బోర్డు సభ్యులు 'ఆహా ఇదేకదా

కథలో నీతి' అంటూ పులకించి పోయి 'యు' సర్టిఫికెట్ (అందరూ చూడదగినది.) ఇచ్చేస్తారు. మొత్తం మీద ఏ సినిమానైనా వీక్షకులు వారి, వారి సొంత



**స్త్రీ హక్కులకు వ్యతిరేకమైన వైఖరి పాశ్చాత్య దేశాల నుండి భారతదేశానికి దిగుమతి అయ్యిందని అనుకోకండి. మన దేశంలో వైదిక యుగంలో గార్గి, మైత్రేయి లాంటి మునిపత్నులు వైదిక శాస్త్రాలలో నిష్ణాతులుగా ఉన్నారు. తర్క శాస్త్రంలో పురుషులను సైతం ఓడించారు. అయితే తమ భార్యల మేధస్సు ముని పుంగవులకు నచ్చలేదు. అందువల్ల తమ భార్యలనే శపించిన 'ఉదారులు'వారు.**

అభిరుచులతోనూ, అభిప్రాయాలతోనే చూస్తారు.

స్త్రీ హక్కులకు వ్యతిరేకమైన వైఖరి పాశ్చాత్య దేశాల నుండి భారతదేశానికి దిగుమతి అయ్యిందని అనుకోకండి. మన దేశంలో వైదిక యుగంలో గార్గి, మైత్రేయి లాంటి మునిపత్నులు వైదిక శాస్త్రాలలో నిష్ణాతులుగా ఉన్నారు. తర్క శాస్త్రంలో పురుషులను సైతం ఓడించారు. అయితే తమ భార్యల మేధస్సు ముని పుంగవులకు నచ్చలేదు. అందువల్ల తమ భార్యలనే శపించిన 'ఉదారులు'వారు.

ఇలాగే మహిళా చైతన్యాన్ని కూడా పలువురు పలు రకాలుగా అర్థం చేసుకున్నారు. దీన్ని కొందరు తీవ్రంగా వ్యతిరేకిస్తారు. మరికొందరు గట్టిగా సమర్థిస్తారు. సాధారణంగా జనం దీన్ని తమ వద్దకు రాకుండా జాగ్రత్త పడుతుంటారు. మరీ చెప్పాలంటే 'తిట్టు పదాలు'లో దీన్ని కూడా ఇంచుమించు చేర్చేశారు. విచారించాల్సిన విషయం ఏమిటంటే అధిక సంఖ్యాకుల స్త్రీలకే ఈ పదం తెలియదు.

**సరిపడుతుందా...?**

'అన్నీ సరేనండీ..! అయితే మా అమ్మాయికి, నా భార్యకు ఇది సరిపడదండీ...! సంసారం చేసుకునేవాళ్ళకు ఇదెక్కడైనా సరిపడుతుందాండి..?' అని కొందరు ప్రశ్నిస్తారు.

(మరండీ, అంటే మేమందరం సంసారాలు చేసుకోవటంలేదా...!కంపెనీలా నడుపుతున్నాం...?')

మహిళా చైతన్యం గురించిన ఒక పెద్ద మూఢనమ్మకమిది. ఒక సాధారణ స్త్రీ, సంసార పక్షంగా ఉన్న మహిళ స్త్రీ హక్కుల గురించి మాట్లాడజాలదు అని వాదించటమే దీనర్థం. అనేక సినిమాలూ ఈ భావాన్నే చూపరుల బుర్రల్లో ఎక్కించుతున్నాయి. ఆ విధంగా ఈ నిర్మాతలు, డైరెక్టర్లు 'మహత్తర సామాజిక సేవ' చేస్తున్నారు. మనం చూసే చలన చిత్రాల్లో మహిళా హక్కుల గురించి మాట్లాడే స్త్రీలు ఉన్నత కుటుంబాలకు చెందిన వారుగా, సంపన్నులుగా, పని పాటలు చేసేందుకు పని మనుషులున్న వారుగా, ఉబుసుపోక కబుర్లాడే వారుగా, భర్తను వదిలేసిన వారుగా, అవివాహితులుగా, విడాకులు తీసుకున్న వారుగా, మొత్తంగా తమకంటూ సొంత కుటుంబమే లేనివారుగా మనకు కనిపిస్తారు. సినీ నిర్మాతలు మహిళా హక్కులను అంత చులకనగా చూస్తారు. ఆ సినిమాను చూసే మహిళలు కూడా అది మనకు పనికిరాదనే నిర్ణయానికి వచ్చేస్తారు.

మరోపక్క 'ఓహో, మీరు స్త్రీ స్వాతంత్ర్య బృందంవారా...? అయితే మేం జాగ్రత్తగానే ఉండాలండి' అని కొందరు పురుషులు లేని భయం నటిస్తారు. అనగా మహిళా సంఘ నాయకులంటే పురుషులను ద్వేషించేవారు, మగవారితో కొట్లాడేవారని అనుకుంటారు.

1848వ సంవత్సరంలో అమెరికాలో బానిస వ్యవస్థపై ప్రతిఘటనోద్యమం సాగింది. ఆ సందర్భంలో అమెరికాలో ప్రప్రథమంగా జరిగిన మహిళా మహాసభ మహిళల హక్కులకు సంబంధించిన కొన్ని డిమాండ్లు దేశం ముందుంచింది. మహిళలందరికీ ఓటుహక్కు కోరింది. కానీ 1928వ సంవత్సరానికి వారి కోరిక నెరవేరింది.

'అరే, అది మీరేనా..? మిమ్మల్ని చూస్తే అలాగనిపించటంలేదే...!' అంటూ కొందరు ఆశ్చర్యపడిపోతారు. దీనికర్థమేమిటీ...? స్త్రీ చైతన్యం గురించి మాట్లాడేవారు మిక్కిలి ప్రత్యేకంగా ఉంటారు. టపీమని నవ్వరు. ముచ్చులాగా, కఠినంగా ఉంటారు. (అదృష్టవశాత్తు ఇంతవరకు వారికి కొమ్ములు మొలిచుంటాయని ఎవ్వరూ అనుకోలేదు). బిగ్గరగా మాట్లాడుతారు. మొత్తంగా ఎదుటి మనుషులను సతాయించేస్తారు.

ఇంత వరకు చెప్పిన వాటన్నింటినీ ఓడించేసే మరో తత్వమొకటి ఉంది. అది నిజంగానే పెద్ద మూఢనమ్మకం. కొందరు యువతులు చీరకు బదులు ప్యాంటు, షర్టు ధరిస్తే అదేదో మహాపరాధమన్నట్లు 'హూ.. కలియుగం దగ్గరకొచ్చేసింది. మహిళా హక్కులు, మహిళా హక్కులని చెప్పి దుస్తులు కూడా అసభ్యంగా మారిపోతున్నాయి' అంటూ నిట్టూర్పు విడుస్తారు. మరికొందరైతే అసభ్యంగా, మగవారిని రెచ్చగొట్టే విధంగా బట్టలు ధరించటమే చైతన్యమనే కుతర్కానికి పాల్పడతారు. అందువల్లే కొందరు పత్రికా సంపాదకులు కూడా ముందూ వెనుకా ఆలోచించక బట్టలు విడిచేయడమే మహిళా 'విముక్తి' అని తమ పత్రికల్లో రాస్తుంటారు. అయితే మహిళా చైతన్యాన్ని సమర్థించే ఎవ్వరూ ప్రపంచంలో ఇంత వరకూ స్త్రీల హక్కులంటే నగ్నంగా మారటమని చెప్పనేలేదు.

కొందరిలా చెప్పటానికి 1960 సంవత్సరాల్లో పాశ్చాత్య దేశాల్లో ఉద్భవించిన మహిళా విముక్తి ఉద్యమం

**1848వ సంవత్సరంలో అమెరికాలో బానిస వ్యవస్థపై ప్రతిఘటనోద్యమం సాగింది. ఆ సందర్భంలో అమెరికాలో ప్రప్రథమంగా జరిగిన మహిళా మహాసభ మహిళల హక్కులకు సంబంధించిన కొన్ని డిమాండ్లు దేశం ముందుంచింది. మహిళలందరికీ ఓటుహక్కు కోరింది. కానీ 1928వ సంవత్సరానికి వారి కోరిక నెరవేరింది.**

**స్త్రీ మయం చేయబడిన పేదరికం ఎలా ఏర్పడుతుంది..? పిల్లలను, వృద్ధులను, రోగులను చూసుకునే ప్రతిఫలం లేని పనులు మహిళలు మాత్రమే ఎందుకు చేయాల్సి వచ్చింది...' ఇవన్నీ పనులా...? కర్తవ్యాలు కదా...? ఆడవారికి వాత్సల్యం లేదా...' అని ప్రశ్నించొచ్చు. అయితే పురుషులు మాత్రం ఈ పనులు ఎందుకు చేయటం లేదు...?**

కారణంగా ఉండొచ్చు. ఆ ఉద్యమానికి చెందిన కొందరు మహిళలు తమ లో దుస్తులను బహిరంగంగా ఊడదీసి పారేశారు. కాల్చేశారు. నిజానికి వారు తరతరాలుగా పురుషుల భోగలాలసతకు బలైన మహిళల విముక్తికి చిహ్నంగా ఆ కార్యక్రమాన్ని నిర్వహించారు గానీ లోకంలో పూర్తిగా నగ్నంగా తిరగటానికి కాదు. కానీ పత్రికలు, టివి ఛానళ్ళు అసలు విషయం వదిలేసి కొసరు విషయానికి ప్రాముఖ్యతనిచ్చి ప్రపంచానికి చాటిచెప్పాయి.

స్త్రీ మయం చేయబడిన పేదరికం ఎలా ఏర్పడుతుంది..? పిల్లలను, వృద్ధులను, రోగులను చూసుకునే ప్రతిఫలం లేని పనులు మహిళలు మాత్రమే ఎందుకు చేయాల్సి వచ్చింది...' ఇవన్నీ పనులా...? కర్తవ్యాలు కదా...? ఆడవారికి వాత్సల్యం లేదా...' అని ప్రశ్నించొచ్చు. అయితే పురుషులు మాత్రం ఈ పనులు ఎందుకు చేయటం లేదు...?

ఆ సమయంలోనే భారతదేశం నుంచి కొందరు మహిళా జర్నలిస్టులు అమెరికా వెళ్ళారు. పై విషయాన్ని అక్కడి మహిళా ఉద్యమ నాయకురాళ్ళను మనవారు అడిగినప్పుడు, వారు తామింత వరకు ఈ సంగతే వినలేదన్నారు. ఎక్కడో కొన్ని స్వల్ప సంఘటనలు మినహా పాశ్చాత్య దేశాలన్నిటా 'లో దుస్తుల దహనం' కార్యక్రమాలు జరగలేదు.

మరికొందరు మహిళా హక్కులంటేనే తమ హక్కులు ఎక్కడ మంటగలిసి పోతాయో అని ఉలిక్కిపడిపోతారు.

**అనేక రకాల స్త్రీ వాదాలు**

ఈ పరిస్థితిలో 'స్త్రీ చైతన్యం' అంటే ఏమిటని మనం పరిశీలించాలి. దీని అంతర్భావం ఏమిటంటే 'స్త్రీ అనే కారణంగానే నా పట్ల వివక్షత చూపరాదు' అనేదే... స్త్రీలు, పురుషులు సమానులుగా భావింపబడాలనేదే దీని అంతస్సారం. మానవ జాతి చరిత్రను కేవలం పురుషుల చరిత్రగా చిత్రించటమూ, ఆడ, మగ ఇద్దరూ ఏనాటికీ సమానులుగా ఉండటానికి వీలుపడదు అనే సామాజిక దృక్పథం స్త్రీ వాదానికి అంగీకారాలు కావు. వీటిని అది ప్రశ్నిస్తుంది. అయితే వ్యక్తీకరణ విభిన్నంగా ఉండొచ్చు. దీన్ని అర్థం చేసుకోవటం కూడా వైవిధ్యభరితంగా ఉండొచ్చు. దీనికి పరిష్కారం కూడా అనేక రకాలుగా ఉండొచ్చు. ఉదహరణకు 'అమెజాన్ స్త్రీవాదం' అనే ఒక విధమైన భావముంది. దాని ప్రకారం మహిళలు శారీరక వ్యాయామం బాగాచేసి, బలము, శక్తి సంపాదించుకుని క్రీడల్లోనూ, సైన్యంలోనూ పురుషులు చేసే పనులన్నింటినీ చేయగలం అనే విషయం నిరూపించాలనేది. అనగా దీనికి ప్రాతిపదిక 'శారీరక బలం'మాత్రమే.

మహిళలు జీవితంలో కొత్త కొత్త రంగాల్లో కొత్తగా ప్రవేశించే సందర్భంగా అలా ప్రవేశించటం సంప్రదాయ విరుద్ధమని గగ్గోలు చేయబడుతుంది. అయితే ఆ సందర్భంలోనే పురుషులకు సంబంధించినంత వరకు వారి ప్రవేశం 'నూతనత్వం' అని కొనియాడబడుతుంది.

**మహిళలు జీవితంలో కొత్త కొత్త రంగాల్లో కొత్తగా ప్రవేశించే సందర్భంగా అలా ప్రవేశించటం సంప్రదాయ విరుద్ధమని గగ్గోలు చేయబడుతుంది. అయితే ఆ సందర్భంలోనే పురుషులకు సంబంధించినంత వరకు వారి ప్రవేశం 'నూతనత్వం'అని కొనియాడబడుతుంది.**

ఇంకో స్త్రీవాదముంది దాన్ని 'వేర్పాటుతత్వ స్త్రీవాద'మంటారు. (సేపరేటిస్ట్ ఫెమినిజం) అంటే 'సమాన'మని గాక, స్త్రీలకు, పురుషులకు ప్రత్యేకమైన లక్షణాలుంటాయని అంగీకరించి స్త్రీ గుణాలని సాధారణంగా చెప్పే ప్రేమ. వాత్సల్యం, కరుణ, దయ, ఆప్యాయత, సహకారం మొదలగు వాటిని అత్యంత గొప్పవిగా భావించడం, 'పర్యావరణ స్త్రీవాదం' ఇది ప్రకృతితో స్త్రీని పోల్చి ప్రకృతి ఎలా దోపిడీకి గురవుతుందో దాని ప్రభావం స్త్రీ మీద కూడా ఉంటుందని వాదిస్తుంది.

'సరళీకరణ స్త్రీవాదం' ఉన్న సామాజిక వ్యవస్థను అలాగే ఉంచుకుని అందులోనే తమ హక్కులు అన్వేషించడం.

19వ శతాబ్దపు చివరలో 'ఆర్థిక స్త్రీ వాదం' విస్తృతంగా ప్రచారంలోకి వచ్చింది. మహిళ ఆర్థిక స్థితిగతులను మెరుగుపరచటం, వారిని వంటపని, ఇంటిపనుల నుంచి విముక్తి చేయటం దీని ఉద్దేశ్యంగా చెప్పబడింది.

1967-68 సంవత్సరాల్లో 'తీవ్ర స్త్రీవాదం' ఉదయించింది. ఇది పౌరహక్కుల ఉద్యమం నుండి, ప్రపంచ శాంతి ఉద్యమం నుండి మొగ్గ తొడిగింది. అన్నీ అణచివేతలకు స్త్రీలపై జరిపే అణచివేతే ప్రాతిపదిక అని ఈ వాదం ఉద్ఘాటించింది. మహిళలపై దమననీతి అన్ని జాతుల్లోనూ, అన్ని నాగరికతల్లోనూ, అన్ని సంస్కృతుల్లోనూ, అన్ని వర్గాల్లోనూ వ్యాపించి ఉందని ఇది పేర్కొంది.

స్త్రీ వాదాన్ని ద్వేషించటం, దాన్ని చూసి భయపడటం అనేది మన సమాజంలో ఒక శాశ్వతమైన వైరస్‌గా వ్యాపించి ఉంది. ఆ వైరస్ లక్షణాలు కొన్ని సమయాల్లో తగ్గుతాయి. మరి కొన్ని సమయాల్లో ఉధృతమవుతాయి.

అయితే మార్క్సిజం చెప్పే మహిళా చైతన్యం వీటన్నిటికన్నా ప్రత్యేకమైంది. ఈ సామాజిక వ్యవస్థ పాలకవర్గాల

**స్త్రీ వాదాన్ని ద్వేషించటం, దాన్ని చూసి భయపడటం అనేది మన సమాజంలో ఒక శాశ్వతమైన వైరస్‌గా వ్యాపించి ఉంది. ఆ వైరస్ లక్షణాలు కొన్ని సమయాల్లో తగ్గుతాయి. మరి కొన్ని సమయాల్లో ఉధృతమవుతాయి.**

కనుసన్నల్లో, పెత్తందారుల మార్గదర్శకత్వంలో నడుస్తోంది. స్త్రీలు, పురుషులందరూ దోపిడీకి గురవుతారు. అసమానతలు కొల్లలుగా ఉన్నాయి. ఈ పరిస్థితిల్లో ఒకరు మాత్రమే (స్త్రీలు మాత్రమే) సమానత్వం పొందలేదు. అందరిపై జరుగుతున్న అణచివేతను అడ్డుకున్నప్పుడే, అందరికీ అభివృద్ధి చెందేందుకు సమాన అవకాశాలు లభించినప్పుడే మహిళలకు కూడా సమానత్వం లభించగలదు. అనగా అందరికీ ఉన్న సమస్యలతో స్త్రీల సమస్యలు కూడా పెనవేసుకుని ఉన్నాయి. అందువల్ల అందరికీ సమాన న్యాయం ఆవిర్భవించినప్పుడే మహిళలు కూడా ప్రయోజనం పొందగలరు.

ఈ వాదన సమంజసంగా లేదూ...! భారతదేశం మొత్తం బ్రిటీష్ వారి బానిసత్వంలో మగ్గుతున్న కాలాన మహిళలకు మాత్రం స్వాతంత్ర్యం కావాలని డిమాండు చేయగలమా...? కోరినా లభించగలదా...? అందువల్లే ఆనాటి మహిళా ఉద్యమాలు హక్కుల కోసం నినదిన్తూనే, దేశ స్వాతంత్ర్యానికే ప్రాధాన్యతనిచ్చాయి. 1960లో ఆహార సంక్షోభం ఏర్పడినప్పుడు స్త్రీలు, పురుషులందరికీ ఆకలి నుండి విముక్తి కలిగించాలని కోరడం జరిగింది. అందరికీ తిండి లభించినప్పుడే స్త్రీలకు కూడా తిండి కావాలని అడగటం సమంజసంగా ఉంటుంది. నేడు కూడా మహిళలకు ఉపాధి, ఉద్యోగ అవకాశాల్లో రిజర్వేషన్ కావాలని కోరటం జరుగుతోంది. మంచిదే...! అయితే మొత్తంగా అందరికీ ఉపాధి, ఉద్యోగ అవకాశాలు పుష్కలంగా లభించినప్పుడే కదా స్త్రీలకు ప్రత్యేక రిజర్వేషన్ కావాలని కోరగలం. కనుక నిరుద్యోగ సమస్య పరిష్కరించటం ప్రథమ కర్తవ్యం కాదా...?

స్త్రీ చైతన్యమనేది పురుషాధిక్యతకు, లింగ వివక్షతకు వ్యతిరేకమైంది. ఇందులో సామాజిక కార్యకలాపాల్లో మహిళల సంపూర్ణ భాగస్వామ్యం, స్త్రీ పురుషులకు సమాన హక్కులు, సమాన వేతనాలు తప్పనిసరిగా ఉండాలి.

నేటి ప్రపంచీకరణ సిద్ధాంతం ఏమిటంటే డబ్బున్న వాళ్ళు ఏమైనా చేసుకోవచ్చు. వారి వారి కోరికలు, అభిరుచులే ప్రధానమైనవి. కోరినవాటిని అనుభవించొచ్చు. అయితే దౌర్జన్యాల నుంచి, హింస నుంచి, అవమానాల నుంచి రక్షణ కావాలని మహిళలు నినదిన్తున్నప్పుడు, వీటికన్నింటికీ కారణమైన ప్రపంచీకరణను వ్యతిరేకించొద్దా...? కేవలం గొణగటం మాత్రమే సరిపోతుందా..? భూస్వామ్య వ్యవస్థ స్త్రీలను అనవసర బరువుగా భావిస్తుంది. ఆర్థిక లాభమే పరమావధి, వేరే దేని గురించి ఆలోచించాల్సిన అవసరం లేదనే మార్కెటీకరణ సిద్ధాంతాన్ని ప్రశ్నించకుండా మహిళా విముక్తి సాధ్యమా...?

**స్త్రీ చైతన్యమనేది పురుషాధిక్యతకు, లింగ వివక్షతకు వ్యతిరేకమైంది. ఇందులో సామాజిక కార్యకలాపాల్లో మహిళల సంపూర్ణ భాగస్వామ్యం, స్త్రీ పురుషులకు సమాన హక్కులు, సమాన వేతనాలు తప్పనిసరిగా ఉండాలి.**

చెల్లెమ్మా...!నీవు ఎక్కడకో వెళుతున్నావే...? ఈనాటి అసమానతలన్నీ ఏనాటికి కనుమరుగు కాబోతాయి...? అంతదాకా ఇలాగే ఉండాలంటావా..?

ఇలాగే ఉండాల్సిన అవసరం లేదు. నిరంతర మార్పు కోసం కృషి చేస్తూనే అత్యవసర నివారణోపాయాల కోసం కూడా ప్రయత్నించాలి. వర్షానికి కురుస్తున్న ఇంటిలో నుండి పాత్రల్లో వర్షపు నీటిని పట్టి బయట పారపోయాల్సిందే, కానీ అంతటితో ఊరుకుంటే ఎలా..? ఇంటి పైకప్పును మరమ్మత్తు చేసుకోవాలిగా..?

'అమ్మా నీవు చెప్పేవన్నీ పాతకాలపు విషయాలే. ఇప్పుడు పరిస్థితులు ఎంతగానో మారిపోయాయిగా. ఇప్పుడు నడుస్తోంది 21వ శతాబ్దంకదా. మేము ముందుకెళుతామంటే ఎవ్వరైనా మిమ్మల్ని ఆపుతున్నారా..?'

ఈ ప్రశ్నకు జవాబు చెప్పటం కాస్త కష్టమే. కొన్ని విషయాల్లో తప్పక అభివృద్ధి కనబడుతుంది. మన సమాజంలో కొందరికి మంచి ఉన్నతి కలిగింది. అయితే ఇవన్నీ కురుస్తున్న ఇంటిలో పాత్రల్లో నీరు పట్టుకోవడం లాంటిదే.

ప్రస్తుతం ఎంతోమంది మహిళలు పంచాయితీ, నగర పాలక సభ్యురాళ్ళుగా ఎన్నికవుతున్నారు. ఇది ముందడుగేనా అని ప్రశ్నిస్తే ఖచ్చితంగా ముందడుగే. అయితే న్యాయస్థానాల్లో న్యాయవాదులడిగే ప్రశ్నలకు 'అవును, 'కాదు' అని ఒకే పదంలో జవాబు చెప్పజాలం. ఎందరో మహిళలు గ్రామప్రాంతాల్లో పంచాయితీ అధ్యక్షురాళ్ళుగా ఎంపికవుతున్నారు. అందువల్ల వారి ఇళ్ళలో వారి పరిస్థితుల్లో ఏమైనా మార్పు వచ్చేసిందా..? వారు ఉదయం ఆరు గంటలకే వెళ్ళి గ్రామమంతా తిరిగి పారిశుధ్య కార్యక్రమం ఎలా జరుగుతోందో పర్యవేక్షించాలి. 'ఇదుగో చూడండి, నేను పంచాయితీ అధ్యక్షురాలిని..! కాసేపు బయటకెళ్ళి వస్తాను. అంతలోగా వంటా, వార్పు

**చెల్లెమ్మా...!నీవు ఎక్కడకో వెళుతున్నావే...? ఈనాటి అసమానతలన్నీ ఏనాటికి కనుమరుగు కాబోతాయి...? అంతదాకా ఇలాగే ఉండాలంటావా..?**

మహిళలకు అన్ని విషయాలనూ నేర్చుకునే అవకాశం కల్పించకుండానే వారికి అది తెలీదు, ఇది అర్థం కాదు' అని చెప్పుకుంటూ ఉంటాం. అమెరికాలోని హార్వర్డ్ విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ చమ్మర్స్ అనే 'మహానుభావుడు' కూడా మహిళలకు గణితం, సైన్సు సంపూర్ణంగా రాదని చెప్పి చిక్కుల్లో పడ్డాడు. మొత్తం ప్రపంచం నుండి విమర్శనాస్త్రాలు ఆయన్ను తాకాయి. తుదకు క్షమాపణ కోరాల్సి వచ్చింది.

చేసేయండి' అని భర్తతో చెప్పే పరిస్థితి నెలకొని ఉందా...? 'నీవు వెళ్ళిరా...! నేను వంట పని పూర్తి చేస్తాను' అని భర్త చెప్పే మార్పు వచ్చేసిందా..? నేటికీ పంచాయితీ అధ్యక్షురాలి భర్త గ్రామంలో సామాన్యంగా తెల్లవారగానే టీ కొట్టు దర్శనం చేసుకుని, తరువాత సిగరెట్ తాగుతూ రచ్చబండపై కాసేపు బాతాఖానీ లో మునిగుండటమే కదా మనం చూస్తున్నాం..! 'నా దగ్గరే నీ అధ్యక్షురాలి హోదా చూపిస్తున్నావా..? అదేం కుదరదు తెలుసుకో." అంటూ మండిపడే భర్త మనకు కనబడతాడు. దాంతోపాటు నాలుగు బాదుళ్ళు కూడా అధ్యక్షురాలికి బోనస్‌గా లభిస్తాయి. మన అధ్యక్షురాలు పాపం పిల్లలకు తల్లిగా, మగడికి పెళ్ళాంగా బాధ్యతలు నిర్వర్తించడమేగాక, పంచాయితీ అధ్యక్షురాలిగా కూడా తన కొత్త కర్తవ్యం నెరవేర్చాల్సి ఉంది. కానీ అందుకనువైన పరిస్థితి మాత్రం లేదు.

మహిళలకు అన్ని విషయాలనూ నేర్చుకునే అవకాశం కల్పించకుండానే వారికి అది తెలీదు, ఇది అర్థం కాదు' అని చెప్పుకుంటూ ఉంటాం. అమెరికాలోని హార్వర్డ్ విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ చమ్మర్స్ అనే 'మహానుభావుడు' కూడా మహిళలకు గణితం, సైన్సు సంపూర్ణంగా రాదని చెప్పి చిక్కుల్లో పడ్డాడు. మొత్తం ప్రపంచం నుండి విమర్శనాస్త్రాలు ఆయన్ను తాకాయి. తుదకు క్షమాపణ కోరాల్సి వచ్చింది.

ఇది కొంత వరకు పరవాలేదు. భార్య పంచాయితీ సభ్యురాలు అయితే ఆమెకు బదులు పంచాయితీ సమావేశాల్లో భర్తే పాల్గొనటం మనం తరచుగా చూడొచ్చు. ఆ సమావేశం జరుగుతున్నప్పుడు మీరో, నేనో లోపలకెళ్ళటానికి ప్రయత్నిస్తే ప్రభుత్వాధికారులు అనుమతిస్తారా,,; అయితే సభ్యురాలి భర్తకు మాత్రం పూర్తి స్వేచ్ఛను ప్రసాదిస్తారు. వారిలా ఎందుకు చేస్తారు. భార్యాభర్తల శరీరాలు వేరువేరు అయినా ప్రాణం ఒక్కటేనని ఆ ప్రభుత్వాధికారులు నిర్ణయానికొచ్చేశారా..? అదే నిజమైతే భర్త పంచాయితీ సభ్యుడయితే అతనికి బదులు, అతని భార్యను సమావేశానికి అనుమతిస్తారా..? ఇక్కడే వివక్ష అనేది నగ్నంగా కనబడుతోంది.

## గర్భసంచులు, చేతులు

గృహిణులుగా మాత్రమేగాక ఉద్యోగినులుగా, ఉపాధ్యాయినిలుగా, పనివారులుగా వ్యవహరిస్తున్న మహిళలను మీరు గమనించండి. వేకువజామునే లేచి తొందర, తొందరగా ఇంటి పనులన్నీ పూర్తి చేసి ఆఫీసులకు, స్కూళ్ళకు, పని ప్రదేశాలకు పరుగులు తీస్తూ వస్తారు. అలాంటి మహిళలు పాపం కొత్త విషయాలు ఎలా కనుగొనగలుగుతారు..? ఏమి సాధించగలుగుతారు...?(ఇలాంటి క్లిష్ట పరిస్థితుల్లో కూడా కొందరు మహిళలు అపూర్వ విజయాలు సాధించారనే విషయం గమనించదగ్గది.) ఇలాంటి ఇళ్ళలోని వారి భర్తలు తమ జీవిత భాగస్వాముల పనులు కాస్త తమపై కూడా వేసుకోవచ్చుగా...! ఒక స్త్రీ వండగలుగుతుందంటే పురుషుడు వండలేడా..? తప్పక వండగలడు. ఎందుకంటే స్త్రీలు తమ గర్భసంచులతో వంట చేయటంలేదు. తమ చేతులతోనే చేస్తున్నారు. గర్భసంచి కలిగినవారే పిల్లలకు జన్మనివ్వగలరు. మగవారికి గర్భసంచులు లేవు గనుక వారికి బాధ్యత ప్రకృతే అప్పగించలేదు. సమానత్వం మాట్లాడుతున్నామని ఏ మహిళా కూడా 'ఐదు మాసాలు గర్భం నేను మోస్తాను, మరో ఐదు మాసాలు నీవు మోయి' అని తన భర్తతో చెప్పటం లేదు. అది శాస్త్రబద్ధమైన వాదనకూడా కాదు. అయినా చేతులున్నవారందరూ వంట చేయొచ్చు. మగవారికి కూడా చేతులున్నాయిగా...? కనుక వారు కూడా తప్పక వండి వార్చొచ్చు.

ఆహా...!చెప్పేశారయ్యా...!ఎప్పుడో మా అయ్య స్త్రీ వాదం మాట్లాడే ఆడోళ్ళు తమ మొగుళ్ళు చేతుల్లోకి గరిటిచ్చి వంటగదికి పంపేస్తారని చెప్పాడు. అది ఇప్పుడు నిజమవుతోంది.

ఆహా...!చెప్పేశారయ్యా...!ఎప్పుడో మా అయ్య స్త్రీ వాదం మాట్లాడే ఆడోళ్ళు తమ మొగుళ్ళు చేతుల్లోకి గరిటిచ్చి వంటగదికి పంపేస్తారని చెప్పాడు. అది ఇప్పుడు నిజమవుతోంది.

అరెరె....కాస్త ఆగండి మహాప్రభూ..! గబగబ నోటికొచ్చిందంతా మాట్లాడేయకండి..! భార్యకూడా మీ మాదిరి ఒక మనిషే కదా..? ఇద్దరూ ఉద్యోగులయినప్పుడు సాయంకాలం ఇద్దరు అలసి, సొలసి ఇల్లు చేరుకుంటారుగా..? వచ్చిన తరువాత మీరు హాయిగా కాలుమీద కాలేసుకుని విశ్రాంతిగా కూర్చునేస్తారు. అయితే మీ భార్య మాత్రం రాత్రి వంట కోసం తాపత్రయపడాలని ఎక్కడైనా ఉందా..?

మాకు ఇంటి పనులు, వంట పనులు తెలీవుగా...! అలవాటు కూడా లేదే..! మాకు తెలిసుంటే ఊరుకుంటామా...?

అవునండీ..? ఆడపిల్ల మాత్రం

మాకు ఇంటి పనులు, వంట పనులు తెలీవుగా...! అలవాటు కూడా లేదే..! మాకు తెలిసుంటే ఊరుకుంటామా...?

**వ్యవసాయ పనులు సగం పైగా మహిళలే చేస్తారు. మహిళలే సేద్యపు పనుల్లో పాల్గొంటారు. అయినా పురుషులకన్నా చాలా తక్కువ కూలీయే వారికి ఇవ్వబడుతోంది. అందుకు స్త్రీలు చేసే పని సులభమైంది అని అంటారు. కానీ ఎనిమిది గంటలసేపు ఒంగుని నాట్లేయటం సులభమైన పనా...? ఒక నారుకు, మరో నారుకు మధ్య చోటొదిలి ఖచ్చితంగా నాట్లేయటం తక్కువ పనా..? నిజానికి ఆడది తక్కువ స్థాయిగలదిగా భావింపబడటం వల్లే ఆమెకు పురుషుడి కన్నా తక్కువ కూలీ ఇవ్వబడుతోంది. ఇది పురుషాహంకార ప్రతిఫలమే. అదీగాక ఈ సాకుతో మహిళల శ్రమ చౌకగా దోపిడీ చేయబడుతోంది. కనుక ఇది వర్గ సమస్య కూడా.**

పుట్టేటప్పుడే వంట, ఇంటి పనులు అంతా క్షుణ్ణంగా నేర్చుకుని వచ్చేసిందా..? అన్నీ ఇక్కడ నేర్చుకున్నదేగా...! ఏ పురుషుడికీ వంట రాదని చెప్పగలమా..?టీ మాస్టర్ అంటారు. సరుకు మాస్టర్ అంటారు. నలభీమపాకం అంటే పెళ్ళిళ్ళలో మగవారే వేలమందికి వండి వార్చుతారు. హోటళ్ళలో ఫలహారాలన్నీ మగవారే చేస్తుంటారు. గుళ్ళల్లో పురుష పూజారులే దేవుడికి నైవేద్యాలు తయారుచేస్తుంటారు. వీరందరూ ఇక్కడే వంటపని నేర్చుకున్నవారేగా..? కనుక మీరు కూడా నిశ్చయం చేసుకుంటే సులభంగా వంట నేర్చుకోగలరండీ. మహిళలకు వంటపని భారం, ఇంటిపని భారం తగ్గితే మరింత తమ సామర్థ్యాన్ని పెంచుకోవటానికి చదువుకోగలరు. తమ పిల్లలకు మంచి గురువుగా వర్ధిల్లగలరు. సామాజిక కార్యక్రమాల్లోనూ పాల్గొని, సమాజ పురోభివృద్ధికీ తమ వంతు కృషి చేయగలరు. ఇవి ఏవీ లేనందువల్లే ఆడదానికి ఏదీ తెలీదు. అందువల్ల ఆమె ఏమీ చేయలేదు. అనే భావం సర్వత్రా వ్యాపించింది.

వ్యవసాయ పనులు సగం పైగా మహిళలే చేస్తారు. మహిళలే సేద్యపు పనుల్లో పాల్గొంటారు. అయినా పురుషులకన్నా చాలా తక్కువ కూలీయే వారికి ఇవ్వబడుతోంది. అందుకు స్త్రీలు చేసే పని సులభమైంది అని అంటారు. కానీ ఎనిమిది గంటలసేపు ఒంగుని నాట్లేయటం సులభమైన పనా...? ఒక నారుకు, మరో నారుకు మధ్య చోటొదిలి ఖచ్చితంగా నాట్లేయటం తక్కువ పనా..? నిజానికి ఆడది తక్కువ స్థాయిగలదిగా భావింపబడటం వల్లే ఆమెకు పురుషుడి కన్నా తక్కువ కూలీ ఇవ్వబడుతోంది. ఇది పురుషాహంకార ప్రతిఫలమే. అదీగాక ఈ సాకుతో మహిళల శ్రమ చౌకగా దోపిడీ చేయబడుతోంది. కనుక ఇది వర్గ సమస్య కూడా.

**మీరేం చెప్పినా సరే వందల సంవత్సరాలుగా ఇలాగే కదా జరుగుతోంది...? మరి ఇప్పుడు మార్చేయాలంటే జరిగే పనేనా..?**

మీరేం చెప్పినా సరే వందల సంవత్సరాలుగా ఇలాగే కదా జరుగుతోంది...? మరి ఇప్పుడు మార్చేయాలంటే జరిగే పనేనా..?

**(స్త్రీ బానిసత్వం మానవ సమాజంలోఎప్పుడు ప్రారంభమయ్యింది..? అన్నది తరువాయి సంచికలో...)**

## 9వ పేజీ తరువాయి

### శిరీన్ నిషాత్

శిరీన్ ఇరాన్ దేశీయురాలు. నేటి ఇరాన్ పూర్వం పర్షియా అని పిలువబడింది. క్రీ.పూ.600 సంవత్సరాల నుంచే మానవ నాగరికత పరిఢవిల్లిన దేశం ఇరాన్. కవులు, పండితులు, కళాకారులు, ప్రపంచప్రఖ్యాతి చెందిన సూఫీ తత్వవేత్తలు ఆవిర్భవించిన విశిష్టదేశం పర్షియా. అలాంటి జీవగడ్డలో 20వ శతాబ్దిలో అయతుల్లా ఖొమైనీ లాంటి కరుడుగట్టిన మత ఛాందసులు పుట్టి పరిపాలన కూడ చేసారు. అంతకు పూర్వమే పర్షియాపేరు చరిత్రలో ఇరాన్‌గా మారింది.

అణచివేతనుండి స్వేచ్ఛ అనే అంకురం ఆవిర్భవిస్తుంది. ఇస్లాం మత సాంఘిక దురాచారాలనెదిరించిన వీరవనిత శిరీన్‌నిషాత్. ఇరవయ్యో శతాబ్దంలో మతాధిపతుల పెత్తనం ఎదురులేకుండా చెలామణి అయ్యేరోజుల్లో ముస్లిం మహిళల ఉన్నతి కొరకు కృషి చేసిన మహిళ నిషాత్. ఇరానియన్ విజువల్ అర్టిస్టుగా, ఫిల్మ్‌మేకర్‌గా ఎదిగింది శిరీన్‌నిషాత్.

స్త్రీ అబల అని, అశక్తురాలని అనుకునే వారి మనసులో ముద్రితమైన బొమ్మను చెల్లాచెదురుగా చెదరగొట్టాలనేదే తన ఆశయమని వెల్లడించింది. ఆ తలంపుతోనే రకరకాల ఇమేజెస్‌ను మహిళలముందు వుంచుతాననంటుంది శిరీన్, ఏదైన ఒక పనిచేస్తే గుండె ఆగిపోవాలి. లేకపోతే ఏడ్పయినా రావాలి. అదేతన ఆశయమని వెల్లడించారు. అలాంటి ఆశయాల పనితనంతో కనీసం మీ మనసులను కలవరపరచినా చాలనుకుంటాను. తృప్తి పడతానని వెల్లడించింది. అయితే ఆమె ఈ అభిప్రాయాలను వెల్లడించినపుడు ఇరాన్‌లో లేదు. న్యూయార్కులో ఉంది. జులై 2004లో న్యూయార్కులో "విమెన్ విథౌట్‌మెన్" అనే ఫీచరు ఫిల్మ్ తీసే పనిలో నిమగ్నురాలయి వుంది. నిషాత్‌లాంటి మేరు పర్వతం లాంటి మహిళలు వందల వేలకొలది ఉద్భవించాలని కోరుకుందాం.

కథ

# భోజ్యేషు భర్తా....

-మృణాళిని

**కోమలి రాసుకుంది. కేవలం తన సలహాలు రాసుకునేందుకే కోమలి భర్త ఒక నోట్‌బుక్ కొని పెట్టాడు. అందులో శీర్షికలన్నీ అతని ఆమోదంతో కోమలి రాసుకుంది... 1.ఇంగువ రహిత పదార్థాలు 2. ఇంగువ సహిత పదార్థాలు. 3. అధిక ధనియాల పదార్థాలు. 4. స్వల్ప ధనియాల పదార్థాలు 5. దంచిన వెల్లుల్లి కూరలు, 6. దంచని వెల్లుల్లి కూరలు, 7. మెంతి గింజల ఆకుకూరపప్పులు 8.మెంతిపొడి పప్పులు...**



కోమలీ భర్త తృప్తిగా చుట్టూ చూసాడు. కుర్చీలో చేరగిలబడి కూర్చున్న తన మిత్రులను చూసి నవ్వుతూ అన్నాడు. "ఈ ఆడవాళ్లు చాలా హంగామా చేస్తారుగానీ, నిజానికి వంట ఎంత మహాపనోయ్! చిటికెలో చేసి పడేయొచ్చు. అసలివాళ నా వంట చూసి మా కోమలే మూర్ఛపోయిందనుకోండి. ఇంతకూ నా బిర్యానీ ఎలా వుందో చెప్పలేదు మీరు..."

భుక్తాయాసంతో వివిధావస్థల్లో ఉన్న అతని మిత్రులు వంతులు వేసుకొని పొగిడారు కోమలి భర్తను. పురుషులు చేసిన బిర్యానీల్లో ఇది తలమానికమైందని ఒకడన్నాడు. పురుషులు అనకూడదు. హోటల్ షెఫ్‌లుగాని, ఇంటి మగవాళ్లు చేసిన బిర్యానీల్లో ఇది గొప్పదని ఇంకొకడన్నాడు. బిర్యాని కంటే కస్టర్డ్ మహాగొప్పగా ఉందని మరొకడన్నాడు. ఏతావాతా కోమలి భర్త వంటొచ్చిన మగవాడని అందరూ యోగ్యతాపత్రం ఇచ్చేసారు. కోమలి భర్త ఛాతీ ఐదంగుళాలు పెరిగింది. మీసం నిటారుగా నించుంది. కోమలికేసి సగర్వంగా, కళ్లెగరేస్తూ చూసాడు. ముక్తాయింపుగా ఓ మిత్రుడన్నాడు "ఇహనుంచీ నీతో సంప్రదించందే మీ ఆవిడ వంట చేయకూడదోయ్..."

ఇంతటి సార్వకాలిక సత్యాన్ని చెప్పిన మిత్రుడిని కోమలి భర్త వాటేసుకున్నాడు.

* * *

మరుసటి రోజు నుంచి కోమలికీ, భర్తకూ మధ్య ఏకాంతంలోనూ, సమూహంలోనూ సురుచిర సంభాషణ జరిగేది.

"వంకాయకూరలో ధనియాలపొడి వేయకపోయావూ?"

"ఇవాళ చారులో మిరియాలు ఓ రెండు తగ్గినట్టున్నాయే! ఏమిటో రుచి బావులేదు"

"ఎన్నేళ్ళు పోయినా దేనికి ఇంగువ వేయాలో తెలీదు నీకు. నే చెప్తా రాసుకో..."

కోమలి రాసుకుంది. కేవలం తన సలహాలు రాసుకునేందుకే కోమలి భర్త ఒక నోట్‌బుక్ కొని పెట్టాడు. అందులో శీర్షికలన్నీ అతని ఆమోదంతో కోమలి రాసుకుంది... 1.ఇంగువ రహిత పదార్థాలు 2. ఇంగువ సహిత పదార్థాలు. 3. అధిక ధనియాల పదార్థాలు. 4. స్వల్ప ధనియాల పదార్థాలు 5. దంచిన వెల్లుల్లి కూరలు, 6. దంచని వెల్లుల్లి కూరలు, 7. మెంతి గింజల ఆకుకూరపప్పులు 8.మెంతిపొడి పప్పులు...

వంట రోజూ ఆలస్యమే, కోమలికి పుస్తకంలోని విషయాలు కంఠతా రాకపోవడం వల్ల భర్తను అడక్క తప్పేది కాదు.

"ఇంతకూ ఈ మసాలాకూరలో

కొత్తిమీర తుంచి వేయాలా? రుబ్బి వేయాలా?" కోమలి అడిగేసరికి బిక్కముఖం వేసాడు భర్త.

"పుస్తకంలో ఏం వుందో చూసుకో, నన్ను కాఫీ అయినా తాగనివ్వకుండా నిద్రలేపి కొత్తిమీర గురించి మాట్లాడుతావేమిటోయ్" విసుకున్నాడు.

"ఎంత మాటండీ! మీలాంటి నలుడూ, భీముడూ టూ-ఇన్-వన్‌ని ఇంటో పెట్టుకొని ఇన్నేళ్లూ గమనించనందుకే నేను పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నాను. ఇన్నేళ్ల నా అజ్ఞానానికి పరిహారం చెల్లించుకోవద్దూ" అంది కోమలి.

ఉప్పొంగిపోయిన కోమలి భర్త తన ఛాతీ ఇంకా పెరిగితే కొత్త షర్టులు కొనుక్కోవాల్సి వస్తుందని ఆనందాన్ని నిగ్రహించుకున్నాడు.

* * *

మిత్రుల మధ్య కోమలి భర్త స్టేటస్ పెరిగింది. వాళ్లందరి ఇళ్లలోనూ భార్యల సామ్రాజ్యమైన వంటగదిని తనింట్లో కోమలి భర్త తన అదుపులో ఉంచుకోవడం వాళ్లకు మహదానందంగా ఉంది. "ఇవాళ మీ ఆవిడ చేసిన కూర బావుందోయ్" అని ఇదివరకు మెచ్చుకునేవాళ్లంతా 'ఇవాళ నువ్వు చేయించిన కూర బావుందోయ్'' అంటున్నారు. కోమలి భర్త తన మిత్రులకు సలహా యిచ్చాడు.

" మూడు నెల్లకోసారి వంట చేస్తే సరదాగానూ ఉంటుంది. మన భార్యలకు మన సత్తా చూపించినట్టూ ఉంటుంది. ఆ తర్వాత వాళ్ల వంటల్ని వెక్కిరించడానికి మనకు హక్కుంటుంది."

కోమలి భర్త తెలివితేటలకు అందరూ మురిసిపోయారు.

కోమలి ఫోన్లో మాట్లాడుతోంది. షూస్ పాలిష్ చేసుకుంటున్న కోమలి భర్త వింటున్నాడు. "లలితా... ఇక నేను నిశ్చింతగా ఉండొచ్చుననుకో. పగటిపూట వంట ఆయన చూసుకుంటారు. రాత్రి పెద్ద ఇబ్బందేం ఉండదనుకో, కూర,పప్పు ఎలాగూ మిగులుతాయి. ఓ పచ్చడి చేసేస్తే పోతుంది. అయ్యోరామా! ఇంకా మావారి వంట ప్రతాపం నీ దాకా రాలేదా? నిజంగానే చాలా బాగా చేస్తారు. అసలు ఆయన సలహాలేందే నేను వండడం మానేసాను తెలుసా... అదే చెప్తున్నాను. ఇంతకుముందు ఓ కాలేజి నుంచే ఆఫర్ వస్తే అత్తయ్యని ఇబ్బంది పెట్టాల్సి వస్తుందని ఒప్పుకోలేదు. ఇక ఆ బెంగలేదు, ఓకే బై."

కోమలి భర్త బూట్లకు పాలిష్ చేయడం ఎప్పుడో ఆపేసాడు. పాలిష్ రంగుకీ అతని ముఖం రంగుకీ అట్టే తేడా కనిపించడం లేదు. కోమలి భర్త కేసి చూసి ప్రేమగా నవ్వింది. "నిజంగా అదృష్టమంటే నాది... ఓ! మీకింకా అసలు విషయం చెప్పలేదు కదూ..."

"...." పాలిష్ మొహంతో అలాగే చూస్తున్నాడు కోమలి భర్త.

" ఆ మధ్య మీకు జ్వరం వచ్చినప్పుడు ఇంటర్వ్యూకి వెళ్లానే, ఆ ఉద్యోగం వచ్చింది. అది ఎయిడెడ్ పోస్టు. చూస్తూ చూస్తూ మంచి లెక్చరర్ ఉద్యోగం ఎందుకు వదులుకోవడం ? కానీ షిప్టు కాలేజి కదా ఏడు గంటలకే వెళ్లిపోవాలి. వంటాగట్రా ఎలాగా అని బాధపడ్డాను. ఇక భయం లేదు. మీ లాంటి భర్త దొరికాక... అత్తయ్య మూడు నెలల్లో వచ్చేస్తారు కదా. అప్పుడు మీకు సాయం చేస్తారు లెండి".

కోమలి భర్త ఫోన్ దగ్గరికి వెళ్తున్నాడు.

"మీ ఫ్రెండ్సుకేనా? నేనెప్పుడో చెప్పాను. ఇకనుంచి రోజూ మీ టిఫిన్ డబ్బాలో జీలకర్ర రైస్‌లూ, బిర్యానీలూ, కుర్మాలు భలే రుచిగా ఉంటాయని..."

(-కోమలి గాంధారం నుండి)

## మహిళ

మహిళే దేశానికి నిండుతనం
తెలుసుకో తన గొప్పతనం
వారిని గౌరవించాలి మనం
అదే మనకు నిండుతనం
తనకు ఉంది ఎంతో సహనం
వారికి ఇవ్వాలి మన మదిలో తొలిస్థానం
వాళ్ళకి అపారమైన దానగుణం
అదే ఆమె ఆడతనం
మహిళ లేనిదే లేదు లోకం
లోకం లేనిదే తప్పదు శోకం
కానీ దేశంలోని శోకం మహిళ గుండెల్లో
దీనిని మార్చాలి రాబోయే రోజుల్లో
దుర్మార్గుల అధర్మాలకు వేయాలి అడ్డుకట్ట
మహిళ మనసులో దాగి ఉంది మానవత్వం.
ఇది గుర్తుంచుకో నీవు ప్రతి నిత్యం.
మహిళ అంటే నీటి మీద రాత కాదు
మన రాత మార్చే దేవతని తెలుసుకో!!

-పి. హేమమాలిని
7వ తరగతి

## బాలకార్మికత

గణేష్ ! చిన్న మాట ఉంది వినరా!
నీవు చదువుకోరా ముందరా
పనికెందుకురా తొందరా
పిల్లలు బడికి ముద్దురా
పనికి వద్దురా
డబ్బు లేదని చింతేలరా
ఖర్చులేని బడి ఉందిరా
ప్రాథమిక పాఠశాలలో చేరరా
మంచి క్రమశిక్షణలో మెలగరా
బద్ధకం నీకేలరా
కష్టపడి తెలివిగా చదవరా
స్కాలర్‌షిప్‌లెన్నో పొందరా
చదువే నీకు ముద్దురా !
గణేష్! నా మాట వినరా!!

-పి. హేమమాలిని

పోరాట స్ఫూర్తి



## న్యాయంకోసం పోరాడుతున్న

# భన్వరీదేవి

న్యాయం కోసం పట్టుదలగా పోరాడుతున్న భన్వరీదేవి స్ఫూర్తి అనేక మందిని ఆకర్షించింది. మహిళల సమస్యలపై పనిచేసే 5 స్వచ్ఛంద సంఘాలు 1997 లో "విశాఖ" అనే వేదిక ద్వారా సుప్రీంకోర్టులో ప్రజా వ్యాజ్యం (పిల్) దాఖలు చేశారు. ఈ కేసును తీవ్రమైన కేసుగా పరిగణించిన కోర్టు ఒక చారిత్రాత్మక తీర్పును చెప్పింది. ఈ కేసు విశాఖ, ఇతర సంస్థలు మరియు రాజస్థాన్ ప్రభుత్వం మధ్య నడిచింది. పని ప్రదేశాల్లో లైంగిక వేధింపులకు సంబంధించి అంతర్జాతీయ ప్రమాణాలతో కూడిన సూత్రాలను ఈ కేసుద్వారా రూపొందించారు.

జైపూర్‌కు 55 కిలోమీటర్ల దూరంలోని భటేరి అనే గ్రామం భన్వరీదేవి స్వగ్రామం. గ్రామంలో ఒకరోజు 9నెలల పసిపిల్లకు బాల్యవివాహం జరుగుతుండగా భన్వరీదేవి దానిని ఎదిరించి ఆపే ప్రయత్నం చేసింది. ఫలితంగా ఆ గ్రామంలోనివారు ఆమెపై సామూహిక అత్యాచారం జరిపి హింసించారు. ఇది జరిగి 21సం॥లు గడిచిపోయినా భన్వరీ దేవికి న్యాయం జరగలేదు. ఆమె ఇంకా న్యాయంకోసం నిరీక్షిస్తూనే వుంది. నేరం చేసిన దుండగులకు ఇంకా శిక్షపడలేదు. ఈ కేసు రాజస్థాన్ హైకోర్టులో అప్పటి నుండీ నానుతూనే ఉంది.

రాష్ట్రప్రభుత్వం మహిళల అభివృద్ధికోసం చేపట్టిన పథకాల అమలుకోసం పనిచేసే ఒక గ్రామస్థాయి కార్యకర్తగా భన్వరీదేవి అప్పట్లో పనిచేసేది. వారిని సాథిన్‌లని పిలుస్తారు. 1992సం॥లో రాజస్థాన్ ప్రభుత్వం బాల్యవివాహాలు నిరోధించాలనే కార్యక్రమం చేపట్టింది. దానిలో భాగంగానే ఆ ప్రాంతంలో పలుకుబడి గలిగిన గుర్జార్ల తెగల కుటుంబంలో ఒక బాల్య వివాహం జరగబోతుందని భన్వరీదేవి తెలుసుకొని పోలీసులకు సమాచారం అందించింది. ఆ వివాహమయితే ఆగిపోయిందికానీ భన్వరీదేవి జీవితం మాత్రం ఛిద్రమైపోయింది. భర్తను చితకబాది ఆమెపై 5మంది సామూహిక అత్యాచారానికి పాల్పడ్డారు.

ఆ ఘటన తరువాత సుదీర్ఘకాలంగా సాగుతున్న న్యాయ పోరాటంలో ఆమె ఎంతో ధైర్య సాహసాలతో ముందుకు సాగుతుంది. ఆ గ్రామంలో ఒక నిమ్నజాతి కులస్తురాలు అగ్రవర్ణాలను ఎదిరిస్తూ పోరాటం చేయటం సామాన్యమైన విషయం కాదు. కనుక ఆమె పోరాటానికి ప్రాధాన్యత మరింత పెరిగింది.

అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా 2013 మార్చి 9వ తేదీన బెంగుళూరులో జరిగిన ఒక కార్యక్రమంలో భన్వరీదేవి పాల్గొన్నారు. తన జీవితంలోని ఆ సంఘటన తరువాత తాను మౌనంగా కూర్చోకుండా పోరాడటానికే నిశ్చయించుకున్నానని ఆమె చెప్పారు. సామూహిక అత్యాచారం తరువాత ఆమె తన ఫిర్యాదును ఒక ముఖ్యమైన ఫిర్యాదుగా స్వీకరించేటట్లు చేయడానికి అనేక ఆటంకాలు ఎదుర్కోవాల్సి వచ్చింది. కఠినమైన వైద్య పరీక్షలు ఆమెను మరింత వేదనకు గురిచేశాయి. ఆమెను ఆగ్రామంలో వెలివేసినట్లుగా చూసేవారు. ఆమె కుటుంబ సభ్యులు కొంతమంది సైతం ఆమెను ఆవిధంగానే చూసేవారు. కానీ సెషన్స్ కోర్టు

**పని ప్రదేశంలో లైంగికవేధింపులకు సంబంధించిన బిల్లు 2010 (నిరోధం, నిషేధం, పరిష్కారం) ఇటీవల రాజ్యసభలో ప్రవేశపెట్టారు. ఇది గత సంవత్సరం లోక్‌సభలో ఆమోదం పొందింది. అతి ముఖ్యమైన, దీర్ఘకాలంగా ఎదురు చూస్తున్న ఈ చట్టంలో లైంగిక వేధింపులను నిర్వచించడానికి విశాఖ తీర్పులోని నిర్వచనాన్ని ఉపయోగించారు.**

నిందితులను నిర్దోషులుగా ప్రకటించి వదిలిపెట్టిన రోజున ప్రజల నుంచి పెద్ద ఎత్తున నిరసన వచ్చింది. ఈ కేసు విచారణలో సి.బి.ఐ పాత్ర పై భన్వరీ దేవికి తీవ్రమైన ఆగ్రహం కలిగింది. "సి.బి.ఐ ఎంక్వయిరీని ఎప్పుడూ నమ్మకండి. అది చాలా ప్రమాదకరం" అని ఆమె చెబుతుంది

న్యాయం కోసం పట్టుదలగా పోరాడుతున్న భన్వరీదేవి స్ఫూర్తి అనేక మందిని ఆకర్షించింది. మహిళల సమస్యలపై పనిచేసే 5 స్వచ్ఛంద సంఘాలు 1997 లో "విశాఖ" అనే వేదిక ద్వారా సుప్రీంకోర్టులో ప్రజా వ్యాజ్యం (పిల్) దాఖలు చేశారు. ఈ కేసును తీవ్రమైన కేసుగా పరిగణించిన కోర్టు ఒక చారిత్రాత్మక తీర్పును చెప్పింది. ఈ కేసు విశాఖ, ఇతర సంస్థలు మరియు రాజస్థాన్ ప్రభుత్వం మధ్య నడిచింది. పని ప్రదేశాల్లో లైంగిక వేధింపులకు సంబంధించి అంతర్జాతీయ ప్రమాణాలతో కూడిన సూత్రాలను ఈ కేసుద్వారా రూపొందించారు. లైంగిక వేధింపులను రాజ్యాంగం కల్పించిన ప్రాథమిక హక్కులకు భంగం కలిగించేవిగా ఈ కేసుద్వారా గుర్తించారు.

ఈ కేసు విషయంలో రిట్ పిటీషన్ వేసిన సుప్రీంకోర్టు తన తీర్పులో భాగంగా పేర్కొన్న ముందు మాటలలో ఈ రిట్ పిటిషన్ వేయడానికి కారణం రాజస్థాన్ లోని ఒక గ్రామంలో సామాజిక కార్యకర్త దారుణంగా అత్యాచారానికి గురికావడమేనని పేర్కొంది. భన్వరీదేవి ఉదంతం ద్వారా శ్రామిక మహిళలు ఎదుర్కొనే లైంగిక వేధింపుల సమస్యను తీవ్రమైనదిగా పరిగణించక పోవడమనేది తేట తెల్లమవుతుంది. కనుక చట్టం ద్వారా మాత్రమే కాకుండా ఒక ప్రత్యేక యంత్రాంగం ద్వారా లైంగికవేధింపులను నిరోధించాల్సిన అవసరాన్ని భన్వరీదేవి కేసు వెలుగులోకి తెచ్చింది. భన్వరీదేవి చేసిన సాహస పోరాటం భారతదేశంలో మిలియన్ల కొద్దీ శ్రామిక మహిళలు రోజువారీ ఎదుర్కొంటున్న జీవిత సమస్యలకు చారిత్రాత్మక గుర్తింపు తెచ్చింది.

పని ప్రదేశంలో లైంగికవేధింపులకు సంబంధించిన బిల్లు 2010 (నిరోధం, నిషేధం, పరిష్కారం) ఇటీవల రాజ్యసభలో ప్రవేశపెట్టారు. ఇది గత సంవత్సరం లోక్‌సభలో ఆమోదం పొందింది. అతి ముఖ్యమైన, దీర్ఘకాలంగా ఎదురు చూస్తున్న ఈ చట్టంలో లైంగిక వేధింపులను నిర్వచించడానికి విశాఖ తీర్పులోని నిర్వచనాన్ని ఉపయోగించారు.



మార్చి 8 సందర్భంగా బెంగుళూరులో జరిగిన ర్యాలీలో పాల్గొన్న భన్వరీ దేవి

ఈ ఉదంతం జరిగినప్పుడు 33సం॥ల వయస్సులో వున్న భన్వరీదేవి గత 20సం॥లుగా మహిళలకు, నిమ్నకులాల వారికీ ఒక ఆదర్శంగా నిలిచింది. ఆమె కథను విని ఉత్తేజితులైన యువతులు ఇటీవల బెంగుళూరులో ఆమెతో ముచ్చటించారు. భాష సమస్యవల్ల ఆమె తన భావములను వారితో పంచుకోలేకపోయినప్పటికీ ఎంతో ప్రేమగా స్పందించారు. భన్వరీదేవి రాజస్థానీ యాసతో గూడిన హిందిలో మాత్రమే మాట్లాడగలదు. కానీ ఆమె కుమార్తె రామేశ్వరీ ఆమె ఉత్తేజకర మాటలను శ్రోతలకు సమర్థవంతంగా అనువదించింది. భన్వరీదేవి తన ఇద్దరు కుమార్తెలను చదివించింది. (ఆమెకు ఇద్దరు కుమారులు కూడా వున్నారు) 32 సం॥ల రామేశ్వరి ఎం.ఎ. సోషియాలజీ చదివి ఒక స్కూలులో టీచరుగా పనిచేస్తుంది.

భన్వరీదేవి సాథిన్‌గా తన పని కొనసాగిస్తున్నది. ఆమెకు పని ప్రదేశంలో భద్రత అరకొరగా వుంది. మరియు వేతనం అతి తక్కువ. నెలకు 1600 రూ.లు మాత్రమే. ఆమె కేసు విషయంలో పోరాటంతో ఆమెకు ఎంతో గుర్తింపు వచ్చింది. అయినా ఆమె తనకు న్యాయం జరగాలని కోరుకోవడంతోపాటు ఢిల్లీలో సామూహిక అత్యాచార ఘటన (నిర్భయ) లాంటి వాటిలో కూడా న్యాయం జరగాలని ఆరాటపడుతుంది.

"నేరం చేసిన దోషులు ఇప్పటికీ తప్పించుకొని తిరుగుతుంటే రివార్డులద్వారా, తల్లిదండ్రులకిచ్చే నష్టపరిహారం ద్వారా, నా కేసులాంటి వాటిని సినిమాగా చిత్రీకరించడం ద్వారా నీరు గార్చే ప్రయత్నం చేస్తుంటే ఏమి ప్రయోజనం" అని ఆమె ప్రశ్నిస్తుంది. "నా అసలు తపన, ఆరాటం అన్నీ నాకు, మరియు నాలాంటి బాధితులకు తక్షణం న్యాయం జరగడమే అని ఆమె చెబుతుంది.

(-ఫ్రంట్ లైన్ సౌజన్యంతో)

## మణిపూసలు

# శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవి

-వకుళాభరణం లలిత.

1921 మార్చి పూర్వార్థంలో గాంధీ మహాత్ముడు విజయవాడ వచ్చారు. ఆనాడు ఆ పట్టణం పేరు బెజవాడ. బ్రహ్మాండమైన మహిళా సమావేశం జరిగింది. రెండు లక్షల మంది సభ్యులు హాజరైనారు. వాళ్ళందరిలో ఒకే మహిళ గాంధీజీకి ప్రత్యేకంగా కనిపించింది. ఆమె ఖాదీ ధరించింది. ఎక్కడ చూసినా ఆమే. కొంతసేపటికి తన పుస్తెల తాడు, ఒకగాజుల జత ఉంచుకుని తక్కిన సొమ్మంతా కాంగ్రెసు నిధికి సమర్పించింది. దేశంలో బంగారు నగలను ఇచ్చిన మహిళల్లో మొదటివ్యక్తి ఆమె. గాంధీజీ వెంటనే "నీ నగలు సమర్పించటానికి నీ తల్లిదండ్రుల అనుమతిని తీసుకున్నావా?" అని ప్రశ్నిస్తే ఆమె తన తల్లిదండ్రులు ఇటువంటి విషయాల్లో అడ్డగించరని ధీమాగా సమాధానం చెప్పింది. ఆమె ఎవరోకాదు. మాగంటి అన్నపూర్ణాదేవి.

ఆమె ఊరు ఏలూరు. గాంధీని ఏలూరు రమ్మనమని ఆహ్వానిస్తే గాంధీ వెళ్ళారు. 1900లో ఏలూరులో శ్రీ కంగర రామస్వామి, శ్రీమతి పిచ్చమ్మకు ఏకైక సంతానంగా జన్మించింది. తల్లిదండ్రులు బ్రహ్మమత ప్రభావితులు. బానిసత్వం, దాస్యం పనికి రావని వాళ్ళు దృఢంగా నమ్మారు. సమాజంలో సగభాగమైన స్త్రీలు విద్యావంతులై వివేకవంతులైతేనే సమాజం అభివృద్ధి చెందుతుందని వాళ్ళ నమ్మకం. అందుకే వాళ్ళు అన్నపూర్ణను కలకత్తా పంపించి బ్రాహ్మణ బాలికా పాఠశాలలో చదివించారు. ఆమె అనర్గళంగా ఇంగ్లీషు మాట్లాడుతుంది.

ఆరోజుల్లో తమబిడ్డను కలకత్తాలో చదివించటం అంత తేలికకాదు. కొంత డబ్బును పంపిస్తే రచనా వ్యాసంగం చేస్తూ మరి కొంత డబ్బు సంపాదించుకుని ఆమె ఇంటర్‌మీడియట్ వరకు చదువుకున్నారు.

కుశాగ్రబుద్ధి ఉన్న వ్యక్తి. బెంగాలీలో పాండిత్యం ఉంది. బెంగాలీ పుస్తకాలు చదివేవారు. ఎన్నో బొమ్మల పుస్తకాలు బెంగాలులో ఉండటం గమనించి తాను కూడా తెలుగు పిల్లల కోసం "సీతారాముల గాథ" అనే పేరుతో ఎంతో మంచి పుస్తకాన్ని 1916లో రాశారు. అప్పుడు ఆమెకు 16 సంవత్సరాలు మాత్రమే. ఆమె ఎన్నో గ్రంథాలను అనువదించారు. 1920లో శ్రీవిధు శేఖర శాస్త్రిగారు రచించిన "వివాహమంగళము, మహిళా సేవిక' శ్రీమతి సరళాదేవి రచించిన 'నవవర్ష స్వప్నం', 'అరవిందుని లేఖలు, ఈ మూడింటినీ తెలుగులో అనువదించారు. ఈ గ్రంథాలకు 'ఆంధ్ర ప్రచార గ్రంథాలయం' ద్వారా ప్రచురించారు. పిల్లల కోసం బొమ్మల పుస్తకాలు ఇంకా ఎన్నో రాయాలని ఉవ్విళ్ళూరారు.

1920లో ఆమె మేనమామ శ్రీ మాగంటి బాపినీడుతో బ్రహ్మ ధర్మ పద్ధతి ప్రకారం వివాహం జరిగింది. బాపినీడు కలకత్తాలో నేతాజీ సుభాష్‌చంద్రబోస్‌తో కలిసి చదువుకున్నారు. ఇద్దరూ రక్షణశాఖలో చేరారు. కలకత్తా విశ్వవిద్యాలయంలో 'కోర్' ఏర్పరిచారు. బాపినీడు ఉన్నత విద్యకోసం అమెరికా వెళ్ళారు. ఆమెకూడా వెళ్ళాలనుకున్నారు. పాస్‌పోర్ట్ అన్నీ సిద్ధం చేసుకున్నారు. ఇంతలో గాంధీ మహాత్ముడు స్వాతంత్ర్య సమర శంఖారావం ఊదగా ఆమె అమెరికా ప్రయాణం మానుకుని దేశమాత దాస్యశృంఖలాలను విడగొట్టటానికి సిద్ధపడ్డారు. ఆమె నిర్ణయం తల్లిదండ్రులకు గర్వకారణమైంది.

విదేశీ వస్త్ర బహిష్కరణ కోసం తాను అమెరికా వెళ్ళడానికి కొనుక్కున్న విలువైన విదేశీ వస్త్రాలను మంటల్లో ఆహుతి చేశారు. ఖాదీ ధరించటం, రాట్నాలు, మగ్గాలు కొని తోటి పేద ప్రజలకు ఇస్తూ స్వాతంత్రోద్యమానికి ప్రేరణ అయ్యారు. మోహన్‌దాను పరిశ్రమాలయాన్ని ఏర్పరిచారు. ఆమె తల్లి, పెద్దమ్మ అండగా నిల్చారు.

అస్పృశ్యతా నివారణకు దోహదం కలిగించేట్లు వారిని ఇంటికి ఆహ్వానించారు. హరిజన బాలిక రామానుజమ్మను, ఇంకో పిల్లవాడిని పెంచే బాధ్యతను అన్నపూర్ణాదేవి స్వయంగా తీసుకున్నారు.

**విదేశీ వస్త్ర బహిష్కరణ కోసం తాను అమెరికా వెళ్ళడానికి కొనుక్కున్న విలువైన విదేశీ వస్త్రాలను మంటల్లో ఆహుతి చేశారు. ఖాదీ ధరించటం, రాట్నాలు, మగ్గాలు కొని తోటి పేద ప్రజలకు ఇస్తూ స్వాతంత్రోద్యమానికి ప్రేరణ అయ్యారు.**

**తరువాయి భాగం 35వ పేజీలో**

**సర్వే**

## భారతదేశంలో మహిళల

# ఆరోగ్యస్థితి-సవాళ్ళు-కర్తవ్యాలు



-భారతీ సాగర్

భారతదేశంలాంటి అభివృద్ధి చెందుతున్న దేశాలలో మహిళల ఆరోగ్యస్థితి చాలా ఆందోళనకరంగా ఉంది. మహిళ గర్భధారణ నిష్పత్తి రేటు భారత్‌లో అధికంగా ఉంది. దీని వలన మహిళల శారీరక ఆరోగ్యం, మానసిక ఆరోగ్యం దెబ్బతింటోంది. గర్భధారణ నిష్పత్తికి తగినట్లుగా మహిళలకు ఆరోగ్య సేవలు, గర్భం ధరించిన సమయంలో చికిత్సగాని, ప్రసవానంతరచికిత్సగానీ సరిగా అందుబాటులో లేదు. అత్యధిక గర్భధారణ, ప్రసవాల వలన మహిళల్లో రక్తహీనత, జననేంద్రియాల ఇన్ఫెక్షన్లు మొదలగునవి అధికంగా ఉంటాయి. దీని వలన ప్రసవానంతర మరణాలు కూడా అధికంగా ఉంటాయి. మన దేశంలో మహిళల సామాజిక, ఆరోగ్య ఆర్థిక స్థితిని పరిశీలించడానికి ప్రతి ఐదు సంవత్సరాలకి ఒకసారి జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే జరుగుతుంది. 2005-06లో జరిగిన మూడవ ఎన్.ఎఫ్.హెచ్.ఎస్. సర్వే మహిళా ఆరోగ్యం ప్రత్యుత్పత్తి నిష్పత్తి, స్త్రీలపై జరుగుతున్న హింస, పోషకాహార స్థితి, లింగ వివక్షత, మహిళా సాధికారత మొదలగు అంశాల ప్రాధాన్యతతో జరిగింది. ఈ సర్వేలో వెలికి వచ్చిన వాస్తవాలను పరిశీలిస్తే మనం దిగ్భ్రాంతికి గురవుతాము. 21వ శతాబ్దంలో కూడా మహిళల పరిస్థితి ఇలా ఉందా? అని.

భారతదేశం అనేకమైన మతాలు, సంస్కృతులు, జాతులు, ఉపజాతులు, కులాలకు ఆలవాలంగా ఉంది. ఒక్కో మతానికి, తెగకు, సంస్కృతికి ఒక్కో రకమైన ఆచారాలు, అలవాట్లు, నమ్మకాలు ఉన్నాయి. అయితే అన్ని తెగలు, మతాలు, సంస్కృతులు స్త్రీల పట్ల అణచివేత ధోరణిని, అమానవీయ ప్రవర్తననే ప్రోత్సహిస్తున్నాయి. దీని వలననే సమాచార విప్లవ యుగంలో కూడా ఇంకా స్త్రీ లింగవివక్షతకు, గృహహింసకు గురవుతూనే ఉంది. ఆకాశంలో సగమని మహిళా సంఘాలు నినదిస్తున్నా ఆకాశంలో సగానికి సమాన హక్కులు ఇంకా మృగ్యమే. ఎన్ఎఫ్‌హెచ్ఎస్-3లో వెలుగు చూసిన వాస్తవాలను పరిశీలిస్తే ఇది అక్షర సత్యమని మనమందరం అంగీకరిస్తాము.

**భారతదేశం అనేకమైన మతాలు, సంస్కృతులు, జాతులు, ఉపజాతులు, కులాలకు ఆలవాలంగా ఉంది.ఒక్కో మతానికి, తెగకు, సంస్కృతికి ఒక్కో రకమైన ఆచారాలు, అలవాట్లు, నమ్మకాలు ఉన్నాయి. అయితే అన్ని తెగలు, మతాలు, సంస్కృతులు స్త్రీల పట్ల అణచివేత ధోరణిని, అమానవీయ ప్రవర్తననే ప్రోత్సహిస్తున్నాయి. దీని వలననే సమాచార విప్లవయుగంలో కూడా ఇంకా స్త్రీ లింగవివక్షతకు, గృహహింసకు గురవుతూనే ఉంది. ఆకాశంలో సగమని మహిళా సంఘాలు నినదిస్తున్నా ఆకాశంలో సగానికి సమాన హక్కులు ఇంకామృగ్యమే.**

**మహిళల్లో గర్భధారణ నిష్పత్తి**

ఎన్ఎఫ్‌హెచ్ఎస్ (2005-06) సర్వేలో ప్రతి మహిళకు 2.7 శిశువుల చొప్పున ఉంది. ఇది భారతదేశపు మొత్తం నిష్పత్తి. ఈ సంఖ్య వివిధ రాష్ట్రాలలో కులాలు మతాలు, విద్య, ఆవాస స్థానం వీటి ఆధారంగా చూస్తే చాలా వ్యత్యాసంతో కూడుకుని ఉంది. అత్యధిక జనాభా కలిగిన బీహార్లో ఈ నిష్పత్తి ప్రతి మహిళకి నలుగురు శిశువులుగా ఉంది. ఇది అత్యధిక రేటు. స్త్రీ విద్య, సాధికారత అధికంగా ఉన్న కేరళ రాష్ట్రంలో ఈ సంఖ్య రెండుకన్నా తక్కువగా ఉంది. మిగిలిన రాష్ట్రాలలో ఎక్కువగా ఉండటానికి కారణం సమాజంలో పాతుకుపోయిన పుత్రోత్సాహం. కుటుంబం ఒత్తిడి వలన స్త్రీలు కొడుకుని కనటానికి అత్యధిక సార్లు గర్భధారణ చేయడం జరుగుతోంది. దీని వలన శిశువుకి శిశువుకి మధ్య ఎడం తగ్గి స్త్రీల ఆరోగ్యస్థితి దెబ్బతిని రక్తహీనతకి, పోషకాహార లోపానికి స్త్రీ గురవుతోంది. దీని వలన తరువాత జరిగే గర్భధారణ సమయంలో తక్కువ శరీర బరువు కలిగిన శిశువుల జననం, సమయానికి ముందు ప్రసవం జరగటం లాంటి ఉపద్రవాలు ఏర్పడతాయి. ఇంతే కాకుండా గర్భంలో ఉన్నది ఆడ శిశువు అని తెలియగానే చేయించుకునే గర్భస్రావాల వలన మహిళ ఆరోగ్యం మరింతగా దిగజారుతోంది.

వీటిని నివారించాలంటే, మహిళ ఆరోగ్య స్థితి బాగుపడాలంటే గర్భధారణ నిష్పతి తగ్గటం ఒక్కటే మార్గం. గర్భం ధరించాలా వద్దా అనే నిర్ణయాన్ని తీసుకునే హక్కు స్త్రీకి ఉన్నప్పుడే ఇది సంభవిస్తుంది. స్త్రీ విద్య, సాధికారత ఉన్నప్పుడే స్త్రీ ఈ నిర్ణయాలను తీసుకోగలుగుతుంది.

అవాంఛనీయ గర్భధారణ నివారించి, గర్భధారణ నిష్పత్తిని తగ్గించటానికి ఏకైక మార్గం కుటుంబ నియంత్రణ పాటించటమే. ఈ నిర్ణయాన్ని

**దాదాపుగా 20 శాతం మంది భారతదేశ స్త్రీలు మొదటి శిశువు తరువాత రెండో శిశువుకి ఎడం ఇవ్వాలని కాని, అసలు ఇంక పిల్లలు వద్దు అనే ఆలోచనలోనే లేరు. గర్భధారణ అవకాశం అత్యధికంగా కలిగిన యువతులలో మలి శిశువు జననానికి ఎడం ఉంచాలనే ఆలోచన కలిగించగలిగితే గర్భధారణ రేటును గణనీయంగా తగ్గించవచ్చును.**



స్వతంత్రంగా తీసుకునే హక్కు భారతదేశంలో అత్యధిక శాతం స్త్రీలకు లేకపోవటం వలన ఇంకా స్త్రీ తన ఆరోగ్యస్థితిని కాపాడుకో లేకపోతోంది.

గర్భధారణ నిష్పత్తి తగ్గితే దేశజాతీయ ఆదాయం నుంచి మాతాశిశు సంక్షేమానికై జరిగే ఖర్చుని మరింత ప్రభావవంతంగా ఉపయోగించుకోవచ్చును.

**భారతదేశంలో కుటుంబ నియంత్రణ పద్ధతుల ఉపయోగం**

ఎన్ఎఫ్‌హెచ్ఎస్-3 ప్రకారం, నివాసస్థానం, విద్య, మతము ఈ మూడు గర్భధారణ నిష్పత్తిని, కుటుంబ నియంత్రణ పద్ధతుల ఉపయోగాన్ని నిర్ణయించే కీలకాంశాలుగా నిర్ధారణ అయింది.

హైస్కూలు లేదా ఆపై విద్య గరిపిన మహిళల్లో సగానికి పైగా కుటుంబ నియంత్రణ పద్ధతులను పాటిస్తున్నారు. కానీ నిరక్షరాస్య మహిళల్లో ఇది మూడింట ఒక శాతమే ఉంది. ఈ రెండు గ్రూపుల్లో గర్భధారణ నిష్పత్తి ఈ రేటు ప్రతి మహిళకు నాలుగుగా ఉంటే అక్షరాస్యత కలిగిన మహిళల్లో ఇది 2.2 గా ఉంది. మతాల వారిగా కూడా ఈ వ్యత్యాసం స్పష్టంగా కనిపిస్తుంది. ముస్లిం మహిళల్లో అత్యధికం గర్భధారణ నిష్పత్తి, అత్యల్ప కుటుంబ నియంత్రణ సాధనాల ఉపయోగం ఎన్ఎఫ్‌హెచ్ఎస్-3లో పరిశీలించటమైనది. దీనికి కారణం కుటుంబ నియంత్రణ పాటించకూడదనే ముస్లిం షరియత్ చట్టాలు కావచ్చు.

**సామాజిక ఆర్థిక అంతరాలు, ఆరోగ్యసేవల లభ్యత ఈ రెండు ప్రసూతి మరణాలను నిర్ధారించే కీలకాంశాలుగా ఈ పరిశీలనలో గమనించడమైనది.**

దాదాపుగా 20 శాతం మంది భారతదేశ స్త్రీలు మొదటి శిశువు తరువాత రెండో శిశువుకి ఎడం ఇవ్వాలని కాని, అసలు ఇంక పిల్లలు వద్దు అనే ఆలోచనలోనే లేరు. గర్భధారణ అవకాశం అత్యధికంగా కలిగిన యువతులలో మలి శిశువు జననానికి ఎడం ఉంచాలనే ఆలోచన కలిగించగలిగితే గర్భధారణ రేటును గణనీయంగా తగ్గించవచ్చును.

**అత్యధిక గర్భధారణ వలన స్త్రీలలో కలిగే అనారోగ్యాలు**

భారతదేశంలో ప్రతి ఏటా సుమారు 100,000 మంది స్త్రీలు గర్భధారణ సంబంధిత సమస్యలతో మరణిస్తున్నారు. ప్రసవ సమయంలో అధిక రక్తస్రావం, రక్తపోటు, గర్భిణివాతం మొదలగు కారణాల వలన అధికశాతం ప్రసూతి మరణాలు సంభవిస్తున్నాయి. భారతదేశంలో ప్రసూతి మరణాలు అత్యధికంగా, ప్రతి లక్ష జననాలకు 400మంది మహిళలు మరణిస్తున్నారు. ఈ నిష్పత్తి అమెరికా కన్నా 56 రెట్లు ఎక్కువ. ప్రపంచ ఆరోగ్య సంస్థ లెక్కల ప్రకారం ప్రసూతి మరణాల సంఖ్య భారతదేశంలో శ్రీలంక, పాకిస్తాన్ కన్నా ఎక్కువగా ఉంది. భారతదేశంలోని వివిధ రాష్ట్రాలలో కూడా ప్రసూతి మరణాల సంఖ్య వ్యత్యాసంగా ఉంది. గుజరాత్‌లో ఈ సంఖ్య అత్యల్పంగా 135 ఉండగా, రాజస్తాన్, ఉత్తరప్రదేశ్‌లలో ఇది 600 నుండి 677గా ఉంది.

సామాజిక ఆర్థిక అంతరాలు, ఆరోగ్యసేవల లభ్యత ఈ రెండు ప్రసూతి మరణాలను నిర్ధారించే కీలకాంశాలుగా ఈ పరిశీలనలో గమనించడమైనది.

గర్భధారణ సమయంలో 76 శాతం మంది స్త్రీలు వైద్య చికిత్సలను అందుకున్నారు. ఇందులో 44 మందికి మాత్రమే మొదటి మూడు నెలలలోనే వైద్యం ప్రారంభమైనది. 22 మందికి మాత్రం నాలుగు లేక ఐదవ నెలలో వైద్య సేవలు అందాయి. అదికూడా పట్టణాలలో ఉన్న స్త్రీలకు రూరల్ స్త్రీల కన్నా ఎక్కువగా, అంటే మూడు లేదా అంతకన్నా ఎక్కువ సార్లు వైద్య చికిత్సలు అందాయి.

ప్రసవం తరువాత ఆరోగ్య సేవలు కూడా 58 శాతం మంది స్త్రీలకు అందటంలేదనే ఇంకో విచారకరమైన అంశం కూడా ఈ ఎన్ఎఫ్‌హెచ్ఎస్-3 సర్వేలో వెలుగు చూసిన వాస్తవం. ప్రసవం అయిన 48 గంటల సమయంలోపే అత్యధిక సంఖ్యలో స్త్రీ, శిశు మరణాలు సంభవిస్తున్నాయి. ప్రసవం అయిన మొదటి నాలుగు గంటల లోపు వైద్య సహాయం 27 శాతం మంది స్త్రీలకు, కీలకమైన మొదటి రెండు గంటలలోపు 37 శాతం మంది స్త్రీలకు మాత్రమే అందుతోంది.

సామాజికంగా ఉన్నతంగా ఉన్న వర్గాలలో అక్షరాస్యత ఉన్న మహిళల్లోనే ప్రసవం ఆసుపత్రిలో జరగాలని ప్రసవానంతర చికిత్సలు మహిళకు, శిశువుకు సరిగ్గా అందాలనే స్పృహ ఉంది, ముస్లిం మతానికి చెందిన మహిళల్లో ఈ దృక్పథం అత్యల్పంగా ఉంది.

ప్రైవేటు వైద్యశాలల్లో జరిగే ప్రసవాలలో 85 శాతం మంది ప్రసవానంతర ఆరోగ్య సేవలను అందుకుంటున్నారు. ఇంట్లో ప్రసవం జరిగిన మహిళలకైతే ఈ సేవలందటం దాదాపు అరుదు, కేవలం 15 శాతం మందికే ప్రసవమైన తరువాత వైద్య చికిత్సలు

లభిస్తున్నాయి. మహిళకి ప్రసవ సమయంలో ఎంత ప్రాణ ప్రమాదం ఉంటుందో ప్రసవానంతరం కూడా 48 గంటల వరకు అంతేస్థాయిలో ప్రమాదం ఉంటుంది. కాబట్టి ప్రసవానంతరం కూడా వైద్యశాలల్లో చికిత్స చేయించాలి. దీనికి సంబంధించిన అవగాహనను కూడా ప్రజల్లో కల్పించాలి.

**కర్తవ్యాలు**

ఎన్ఎఫ్హెచ్ఎస్ నెట్వర్క్ క్రింద కుటుంబ నియంత్రణ విషయాలపట్ల అవగాహన పల్లెపల్లెల్లో కల్పించాలి. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో కుటుంబ నియంత్రణ సాధనాలు అమర్చటానికి శస్త్రచికిత్సలు చేయటానికి తగిన వైద్య సిబ్బందిని లభ్యం చేయాలి.

**పౌష్టికాహార లేమి-రక్తహీనత**

ఈ రెండు ఆరోగ్య సమస్యలు భారతదేశంలోని మహిళల్లో అత్యధికంగా గమనించదగ్గది. వీటిని సరిచేయటానికి ఐసిడిఎస్ క్రింద పనిచేస్తున్న అంగన్వాడీలకు ఇంకా సౌకర్యాలను కల్పించి బలోపేతం చేయాలి. ఎన్ఆర్హెచ్ఎం క్రింద పనిచేస్తున్న ఎఎన్హెచ్ఎంల సౌకర్యాలను ఉపయోగించుకోవాలి. వీరిద్దరి ద్వారా గర్భధారణ సమయంలో అవసరమైన ఐఎఫ్ఎ మాత్రలను, వాక్సినేషన్ను అందరికి అందేలా చూడాలి.

**ప్రసవం-ప్రసవానంతర చికిత్సలు**

ప్రసవం ఆసుపత్రులలోనే చేయించుకోవాలనే అవగాహన పల్లె ప్రజలకు పట్టణ పేద ప్రజలకు కల్పించాలి. అందుకు అనుగుణంగా ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను, జిల్లా ఆసుపత్రులను పరిపుష్టం చేయాలి. జిల్లా ప్రధాన ఆసుపత్రులలో అత్యవసర సర్వీసుల ఉపలబ్ధి, ప్రసూతి వైద్యుల సర్వీసులు కల్పించాలి.

మహిళా అక్షరాస్యతలో, ఆరోగ్య రక్షణలో అద్భుత ప్రగతి ఉందని ప్రభుత్వం వివిధ వేదికల మీద ఢంకా భజాయిస్తుంది. ఇంకా ముందుకెళితే వడ్డీలేని రుణాలను, నగదు బదిలీ పథకం మొదలగునవి మహిళల పేరుమీదనే ఇస్తున్నామని ప్రకటనలు గుప్పిస్తుంది. కానీ ప్రాథమిక ఆరోగ్య సూచికల గణాంకాలను పరిశీలిస్తే అది అసత్యమని, మహిళా సంక్షేమం శూన్యమని నిరూపితమవుతుంది.

ఈ నిర్లక్ష్యధోరణి ప్రభుత్వంతోపాటు సమాజానికి కూడా ఉంది. చిన్న వయస్సు నుంచి అమ్మాయి అయితే తల్లికి సహాయంగా ఉండటం, ఇంకా ఇంట్లో చిన్న పిల్లలని ఆడించటం మొదలగు పనులకు వినియోగించుటకై ఎక్కువ ప్రాధాన్యత నిస్తారు. సమాజానికి ఆమె ఉపయోగపడాలని, తన ఆరోగ్య రక్షణకి అవసరమైన అవగాహననిచ్చే చదువు ఆమెకి ఉండాలనే దృక్పథం చాలా తక్కువగా ఉంటుంది. "ఇల్లాలి చదువు ఇంటికి వెలుగు" అనేది నినాదంగానే ఉండిపోతోంది.

స్త్రీలో అక్షర జ్ఞానం ఉదయిస్తే తనొక్కదాని గురించే కాకుండా తన ఇంటి గురించి, ఇంట్లోని వ్యక్తుల ఆరోగ్యం గురించి, ఇంటి నిర్వహణ గురించి ఎక్కువ జాగ్రత్తలు తీసుకోగలదు.

అక్షరాస్యత వలన పెరిగే అవగాహనతో స్త్రీ స్వతంత్ర నిర్ణయాలు తీసుకోగలదు. అప్పుడే తనకి అవసరమైన వైద్య సహాయాన్ని కూడా పొందగలదు. నిరక్షరాస్యత, పేదరికం, మత ఛాందసత్వం మహిళలకు మరణ శాసనం రాస్తున్నాయి.

నిరక్షరాస్యత వలన, అవగాహన లోపం వలన స్త్రీ ఎప్పుడు వైద్యులని సంప్రదించాలో నిర్ణయించుకోలేకపోతోంది. గర్భం ధరించాలా వద్దా అనేది కూడా ఆమె చేతుల్లో లేదు. గర్భధారణ తరువాత కూడా పురుషాధిక్య భావజాలం గర్భస్రావాలను చేయిస్తోంది. బిడ్డకి, బిడ్డకీ మధ్య కనీసం ఎడం ఉంచటానికి గర్భధారణ నివారణోపాయలను కూడా పాటించటంలేదు. పేద, ముస్లీం తరగతులలో అయితే గర్భధారణ నిష్పత్తి, ప్రసవాల సంఖ్య అధికంగా ఉంటోంది.

పేదరికం వలన, అజ్ఞానం వలన పరిశుభ్రత పాటించకపోవటం వలన జననేంద్రియాల ఇన్ఫెక్షన్లు, వాటికి చికిత్స చేయించకపోవటం వలన క్యాన్సర్ వ్యాధులు స్త్రీలలో అధికమవుతున్నాయి. ప్రసవ సమయంలో కూడా సగానికి పైగా మహిళలకు భర్త కూడా ఉండటంలేదు. గర్భధారణ సమయంలో పల్లెల్లోని మహిళలు ఆసుపత్రుల మొహం చూడటంలేదు. పట్టణాల్లో మహిళలు మాత్రం ఒకటి నుండి మూడుసార్లు వైద్యశాలలను సందర్శిస్తున్నారు. మూడుసార్లు లేదా అంతకుమించి ఆసుపత్రికి వెళ్ళినవాళ్ళు కేరళలో 90 శాతం ఉంటే బీహార్లో ఇది 27 శాతంగా ఉంది.

దేశవ్యాప్తంగా 55 శాతం మంది మహిళలు అనీమియా (రక్తహీనత)తో బాధపడుతున్నారు. 15-49 సంవత్సరాల వయసున్న స్త్రీలలో 36 శాతం మంది దీర్ఘకాల పోషకాహారలేమితో బాధపడుతున్నారు.

జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే-3 పరిశీలిస్తే గర్భధారణ నిష్పత్తి, కుటుంబ నియంత్రణ పద్ధతుల ఉపయోగం, గర్భధారణ సమయంలో, ప్రసవ సమయంలో వైద్య చికిత్సలు అందుకుంటున్న స్త్రీల గణాంకాలు మహిళల ఆరోగ్యానికి అద్దం పడుతున్నది. •

**పేదరికం వలన, అజ్ఞానం వలన పరిశుభ్రత పాటించకపోవటం వలన జననేంద్రియాల ఇన్ఫెక్షన్లు, వాటికి చికిత్స చేయించకపోవటం వలన క్యాన్సర్ వ్యాధులు స్త్రీలలో అధికమవుతున్నాయి. ప్రసవ సమయంలో కూడా సగానికి పైగా మహిళలకు భర్త అందుబాటులో ఉంటటంలేదు. గర్భధారణ సమయంలో పల్లెల్లోని మహిళలు ఆసుపత్రుల మొహం చూడటంలేదు. పట్టణాల్లో మహిళలు మాత్రం ఒకటి నుండి మూడుసార్లు వైద్యశాలలను సందర్శిస్తున్నారు. మూడుసార్లు లేదా అంతకుమించి ఆసుపత్రికి వెళ్ళినవాళ్ళ కేరళలో 90 శాతం ఉంటే బీహార్లో ఇది 27 శాతంగా ఉంది**

కథ

# ఆవిడ

పి. సత్యవతి



'భాగ్యనిలయం'లో అడుగుపెట్టిన రోష్నికి గులాబీలు, ఆగర్‌బత్తీల వాసన పూసుకున్న మృత్యువు గుప్పుమంటూ గుమ్మంలోనే ఎదురైంది. ప్రశాంతంగా, నిశ్చింతగా వచ్చిన పని అయిపోయినట్లు మంచుపెట్టెలో పడుకున్న తండ్రి రూపంలో "అయిపోయింది. ఈ ఇంటితో నీకు ఋణం తీరిపోయింది'' అంటూ పొడికళ్ళు తుడుచుకుంటూ కౌగిలించుకోబోయింది ఒకావిడ. వదిన తల్లిలా వుంది. ఆవిడ కౌగిలికి చిక్కకుండా లోపలికి వచ్చింది రోష్ని.

బంధుమిత్రులు పదిమందీ హాజరుగా వున్నారు. హాజరుగా వున్న వాళ్లంతా ప్లాస్టిక్ కుర్చీల్లో కూచుని వచ్చిన పని కాస్తా అయిపోతే వెళ్ళిపోడానికి సిద్ధంగా ఉన్నారు. వాళ్ళు కూర్చున్న కుర్చీల కింద నలిపి పడేసిన ఎంగిలి కాఫీ కప్పుల మీద ఈగలు ముసురుతున్నాయి. కొంతమంది మగవాళ్ళు బయట నిలబడి సిగరెట్లు కాలుస్తున్నారు. కొందరు ఆడవాళ్ళు ఒక మూలన చేరి లో గొంతులో మాట్లాడుతున్నారు. తనే ఆలస్యం అయ్యింది. చూడబోతే తత్వం అందరికి వంటబట్టినట్టే ఉంది. అంత్యక్రియలు తప్పవు. మన కాఫీ తలనెప్పులు తప్పవు., పదిమందీ చేరినప్పుడు రకరకాల కబుర్లూ తప్పవు. అర్థరాత్రి హఠాత్తుగా కబురందితే అంతదూరం నుంచీ రావాలి కనుక ఇంతసేపైంది... తను కనపడగానే వాళ్ల మొహాలు తెరిపిన పడ్డాయి. మొన్న వేసవిలో వచ్చినప్పుడు ఎగిరెగిరి తనతో బాడ్మింటన్ ఆడిన మనిషి.. అచ్చంగా నిన్నకాక మొన్న ఫోన్లో తన పదేళ్ల కూతురుతో పావుగంట గలగలలాడిన మనిషి... మూణ్ణాళ్ళ ముచ్చట కోసం ఇందరి అవహేళనకు గురైన మనిషి.

అన్నయ్యా, వదినా ఈ ఇంట్లో కాలుపెట్టి మూడేళ్లయింది. ఇప్పుడు ఇల్లంతా వదిన తాలూకు మనుషులే కనిపిస్తున్నారు. కొన్నాళ్లుగా ఈ ఇంట్లో దొరకని ప్రవేశం ఇప్పుడు దొరికినట్లయింది వాళ్లకి. బయట మావయ్య హడావుడి చేస్తున్నాడు. ఆయన కూడా మూడేళ్ళ తరువాత ఇప్పుడే వచ్చినట్లున్నాడు. వాళ్లంతా ఇప్పుడొచ్చి ఈ వ్యవహారాన్ని భుజాన వేసుకున్నట్లున్నారు. 'ఆవిడ' ఎక్కడా కనపడలేదు.

వరండాలో మాటలు ఎక్కువయ్యాయి. 'ఎంతమంచివాడో !ఎంత హుషారో! ఎంత స్నేహ స్వభావమో!! అప్పుడు నాకది చేశాడు ఇప్పుడు నాకిది చేశాడు.. పొద్దున లేస్తూనే మల్లెపువ్వులాంటి బట్టల్తో వాకింగ్‌కి వచ్చేవాడు.. '

కానీండి కానీండి. రానిచ్చిన సామాగ్రి అంతా వచ్చిందా ? ఆవు నెయ్యొచ్చిందా ? మంచిగంధం చెక్క ఒకటి తెచ్చారా ? కానీండి పొద్దెక్కుతోంది అని ఆయన్ని సాగనంపడానికి ఆత్రపడుతున్నారు. పలకరించి సానుభూతి సంతాపాలు ప్రకటించాలని ప్రయత్నిస్తున్న వాళ్ళని తప్పుకు తిరుగుతోంది రోష్ని. అంతా కృత్రిమంగా, వెగటుగా, మొక్కుబడిగా... ఇంతకీ ''ఆవిడే''దీ? ఎక్కడుంది? కనపడలేదేం?

'ఎంత ఆశపడిందో పాపం... అంతా గాలిబుడగలా పేలిపోయింది. ఏంచేస్తాం కొందరి జాతకాలంతే.. ' నాన్న స్నేహితుడు సారధి వ్యాఖ్యానిస్తున్నాడు. ఆయనకెందుకో 'ఆవిడ' అంటే చిరాకు... ఎవరికి లేదు చిరాకు ? తనకి లేదా? అన్నకి లేదా? వదినకి లేదా? మామయ్యకి లేదా ?అత్తయ్యొచ్చి రోష్ని భుజం మీద చేయ్యేసి ' భాగ్యమ్మ పోవడమే ఈ ఇంటికి శని పట్టింది' అంది. భాగ్యమ్మ రోష్ని తల్లి. బ్రతికి ఉన్నప్పుడు అత్తయ్యకి ఆమె అంటే గిట్టేదే కాదు. అంతా సిద్ధమైంది. పూలదండలు కట్టిన వాహనం ఒకటి వాకిట్లోకి వచ్చింది. అందర్ని ఆయన కాళ్ళకు మొక్కమన్నారు. 'ఆవిడ్ని పిలవండి. వచ్చి దండం పెట్టుకోమనండి' అన్నయ్య కాస్త కటువైన స్వరంతో కేకపెట్టాడు మావయ్య. భాగ్యం అన్నయ్య.

పొద్దుటినించీ 'ఆవిడ' బయటికి రాలేదట. అలాగే గదిలో చాపమీద ముడుచుకు కూచుందట.

అన్నయ్యా, వదినా ఈ ఇంట్లో కాలుపెట్టి మూడేళ్లయింది. ఇప్పుడు ఇల్లంతా వదిన తాలూకు మనుషులే కనిపిస్తున్నారు. కొన్నాళ్లుగా ఈ ఇంట్లో దొరకని ప్రవేశం ఇప్పుడు దొరికినట్లయింది వాళ్లకి. బయట మావయ్య హడావుడి చేస్తున్నాడు. ఆయన కూడా మూడేళ్ళ తరువాత ఇప్పుడే వచ్చినట్లున్నాడు. వాళ్లంతా ఇప్పుడొచ్చి ఈ వ్యవహారాన్ని భుజాన వేసుకున్నట్లున్నారు. 'ఆవిడ' ఎక్కడా కనపడలేదు.

తెల్లవారుతూనే 'ఆవిడ' లేచి కాసేపు మొక్కల్లో తిరిగింది. మొక్కలన్నీ నవనవలాడుతున్నాయి. ఆపైన కాఫీ పెట్టి ఇచ్చింది. ఆవిడ వంట చేస్తుంటే తను ఇల్లంతా తిరిగింది. నాన్న లైబ్రరీ... నాన్న టేపులు, సిడీలు ఆయన కంప్యూటర్, ఆయన బీరువా అన్నీ తీసి చూసింది. పుస్తకాలు వాసన చూసింది. వాటి మధ్య అమ్మ వేపసబ్బు పొడికొట్టి చిన్న మూటకట్టి పెట్టేది. బీరువా తియ్యగానే ఎవరో స్నానం చేసి తువ్వాలు చుట్టుకొని వస్తున్నటుండేది. బొత్తి పెట్టిన ఆయన తెల్లని వాకింగ్ డ్రెస్‌ల మధ్య కలరా వుండలు, ఆయన వాడే మూడు నాలుగు రకాల షూజ్ వరుసగా మెరుస్తూ, అన్నీ అప్పటిలాగే వున్నాయి. తేడా ఒకటే ! భాగ్యం డిలీట్ అయిపోయి ఈవిడ సేవ్ అయింది. ఇప్పుడాయన కూడా డిలీట్ అయిపోయాడు.

'మొహం చూడు' అని గొణుక్కుంది వదిన. పార్వతి వెళ్లి 'ఆవిడ' ని చెయ్యిపట్టుకు తీసుకొచ్చింది. దగ్గరుండి దండపెట్టించింది. వాహనం కదిలిపోయింది. ' ఆవిడ' పమిట కొంగు నోట్లో కుక్కుకుంటూ గబగబ లోపలికి పోయింది. దుఃఖం గూడు కట్టి కమిలిపోయిన ముఖం.

రాత్రేళనించి అమ్మ వచ్చి గంగ ముట్టలేదు. అంతా ఆరగా , ఆరగా కాఫీలు తాగుతూనే వుండారు. ఏం మనషులో ఎంటో... పోనీ నేనిద్దామంటే నన్ను ఆ సాయలకు రానీట్లేదు.... రోషనమ్మా ఆ తల్లికి గొంతు కాత్త తడుపమ్మా' అంది దగ్గరకొచ్చి పార్వతి. భాగ్యమ్మ నాటినించి ఆ ఇంటి పనిమనిషి.

'అమ్మాయ్ రోష్నీ నీ దగ్గర డబ్బేమైన వుందా ? మీ అన్నయ్య ఫోన్ రాగానే అదరాబాదరా పరిగెత్తుకొచ్చాట్ట. ఇప్పుడెంతలేదన్నా పదివేలన్నా కావాలి ఈ పూటకి' అంటూ వచ్చాడు అన్నయ్య మామగారు. రోష్నీ బిత్తరపోయింది. నాన్న పోయాడంటే పరిగెత్తుకు రావటమేకానీ డబ్బు సంగతే ఆలోచన లేదు. పర్సులో ఏం వుందో చూసుకోకుండానే కారెక్కేసింది. ఆమెకి తెరలు తెరలుగా దుఃఖం వచ్చింది. ఎవరు ఎవర్ని ఓదారుస్తారు ? ఎవరి దుఃఖ భారాన్ని వాళ్ళే మొయ్యాలి. ఇంతవరకు గోడకానుకుని చాపమీద కూచున్న 'ఆవిడ' చివ్వున తలెత్తింది! ఊడిపోయిన జుట్టుకి రబ్బర్‌బ్యాండ్ వేసుకుంటూ లేచి బీరువాలోనుంచీ కొంత డబ్బుతీసి రోష్ని చేతిలో పెట్టి 'అన్నయ్యకివ్వు' అంది.

'పిడుగులాంటి మనిషి... నిన్న సాయంత్రం కూడా సూపర్ మార్కెట్‌కొచ్చి ఏవో కొనుక్కుపోయాట్ట. అంతలోకే ఎట్లా మూనుకొచ్చిందో ! 'అన్నాడన్నయ్య మామగారు. 'ఆవిడ' వైపు ఒక వికారమైన చూపు సారించి.

'మాసివ్ హార్ట్ అటాక్‌లు అట్లాగే వస్తాయి' అన్నాడు. అక్కడున్న ఆయన కొడుకు ' పిల్లల్ని అన్యాయం చేసిపోయాడు. పిల్లలూ, భాగ్యమూ ఈ ఇల్లు చూసుకు మురిసిపోయేవాళ్ళు. మాయమాటలు చెప్పి రాయించుకునే వుంటుంది. ఎవరి సొమ్ము ఎవరు తినబుట్టారో ఎవరికెరుక... నేను అన్నయ్యతో చెబుతూనే వున్నాను ఇల్లు రాయించేసుకోరా అని ! వాడు తండ్రిమీద అలిగి కూచున్నాడు. ఇతగాడేమో ఇట్లా అర్థాంతరంగా మాయమైపోయాడు' అన్నాడు మామయ్య. అమ్మ అన్నయ్య... నెమ్మదిగా రోష్నీతో.

హఠాత్తుగా పోయిన ఆ పెద్ద మనిషి విల్లు వ్రాశాడా, లేదా అనేది పెద్ద చర్చ అయిపోయింది బంధుమిత్రులకి, కొంత వినపడేలాగా కొంత వినపడకుండా, కొంత గుసగుసగా.... ఆవిడ మాత్రం ఉలుకూ, పలుకూ లేకుండా కూచుంది. ఇల్లు రాయించుకునే వుంటుంది అందుకే నిమ్మకు నీరెత్తినట్లు కూచుంది'అని తేల్చిన వాళ్ళూ వున్నారు.

బంధుగణం ఎవరికి తోచిన సలహాలు వాళ్ళిచ్చి ఎవరికి తట్టిన వ్యాఖ్యలు వాళ్ళు చేసి నిష్క్రమించాక, అన్నయ్య కూడా వెళ్ళడానికి సిద్ధమౌతూ, 'ఆవిడ' దగ్గరకు వచ్చి 'ఈ చెక్కు వుంచండి' అని ఆవిడిచ్చిన డబ్బుకి చెక్కు చేతిలో పెట్టి సెలవు తీసుకున్నాడు.

'నువ్వు నాలుగు రోజులుండు' అంది 'ఆవిడ' ప్రయాణమౌతున్న రోష్నీ చెయ్యి పట్టుకొని.

దీపక్‌తో పిల్లల్ని పంపించేసింది రోష్ని.

'నువ్వు బయలుదేరవా ?' అని కోపంగా చూసి వెళ్లిపోయాడు అన్నయ్య.

మొన్న వేసవికాలం అందర్నీ రమ్మని నాన్న పిలిచినప్పుడు అన్నయ్య రాలేదు. తనని కూడా వద్దన్నాడు. తనొచ్చిందని కోపమొచ్చి సరిగ్గా మాట్లాడడం మానేశాడు. రాకపోతే ఆ పదిరోజులూ నాన్నతో వుండే అదృష్ట కూడా దక్కేది కాదు. తనకీ, నాన్నకీ మధ్య 'ఆవిడ' అడ్డుగోడలా నిలబడిందన్న భావం అంతగా కరిగిపోకుండానే జరిగిపోయింది ఆ పదిరోజులు. ఇప్పుడు అమ్మా, నాన్నా ఇద్దరూ లేని ఈ ఇల్లు పరాయిదైపోయింది. తనను పలకరించిన ప్రతి మనిషీ ఏదో ఒకవిధంగా ఇంటి ప్రసక్తి తెస్తూనే వున్నారు. నాన్న పోవడంకన్నా ఇల్లు పోవడం వాళ్ళనెక్కువ బాధిస్తున్నట్లు.

తెల్లవారుతూనే 'ఆవిడ' లేచి కాసేపు మొక్కల్లో తిరిగింది. మొక్కలన్నీ నవనవలాడుతున్నాయి. ఆపైన కాఫీ పెట్టి ఇచ్చింది. ఆవిడ వంట చేస్తుంటే తను ఇల్లంతా తిరిగింది. నాన్న లైబ్రరీ... నాన్న టేపులు, సిడీలు ఆయన కంప్యూటర్, ఆయన బీరువా అన్నీ తీసి చూసింది. పుస్తకాలు వాసన చూసింది. వాటి మధ్య అమ్మ వేపసబ్బు పొడికొట్టి చిన్న మూటకట్టి పెట్టేది. బీరువా తియ్యగానే ఎవరో స్నానం చేసి తువ్వాలు చుట్టుకొని వస్తున్నట్లుండేది. బొత్తి పెట్టిన ఆయన తెల్లని వాకింగ్ డ్రెస్‌ల మధ్య కలరా వుండలు, ఆయన వాడే మూడు నాలుగు రకాల షూజ్ వరుసగా మెరుస్తూ, అన్నీ అప్పటిలాగే వున్నాయి. తేడా ఒకటే ! భాగ్యం డిలీట్ అయిపోయి ఈవిడ సేవ్ అయింది. ఇప్పుడాయన కూడా డిలీట్ అయిపోయాడు.

హాల్లో గోడమీద వున్న ఫోటోలో తను స్కర్ట్ వేసుకునీ, అన్నయ్య నిక్కర్లోను, నాన్న గళ్ళలుంగీలోను, అప్పుడే పేరంటానికి వెళ్ళొచ్చి పట్టుచీరెలో వున్న అమ్మ సిమెంట్ గచ్చేళాలు నెత్తిన

తనకో శరీరం వుందని అది కొంత సుఖాన్ని కోరుతుందని ఎప్పుడో మర్చిపోయిన శేషు, మామయ్య ఇంటికన్న భిన్నమైనదేదీ ఆశించే అవకాశం లేని పెళ్ళి అది. పెళ్లినించీ ఇంకే సుఖాన్నీ ఆశించే వయసూ దాటిపోయింది. పెళ్లి ఒక అసరా.... కానీ ఆయన వంట కోసమే ఆమెని తెచ్చుకోలేదు. ఆమెని పట్టించుకున్నాడు. బ్రతకనిచ్చాడు. కాసేపు విశ్రాంతిగా కూచుని సంగీతం విననిచ్చాడు. పుస్తకాలు చదవనిచ్చాడు.

పెట్టుకుని!! 'భాగ్యనిలయం నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలలాగా ఫోజు' అనేవాడు అన్నయ్య ఇంక ఈ ఇల్లు వుండదు. తనిక్కడికి రాలేదు. రెండు రోజులు మౌనంగానే గడిచిపోయాయి. మూడోరోజు ధైర్యం కూడగట్టుకుని అడిగింది 'అసలు మానాన్నగారు మీకెట్లా తెలుసు ? మీకన్న ఇరవై ఏళ్ళు పెద్దైన ఆయన్ని ఎందుకు పెళ్ళిచేసుకున్నారు? ఆఫ్‌కోర్స్ ఆయన ఇంత త్వరగా పోతారనుకుని వుండరు .... మేమూ అనుకోలేదు. చాలా దృఢమైన మనిషి'.

'ఆవిడ' రోష్నీ కళ్ళల్లో దేనికోసమో వెతుకుతున్నట్లు రెండు క్షణాలు చూసి 'చెప్తున్నాను' అంది.

అమ్మా, నాన్నా బస్సు యాక్సిడెంట్‌లో చనిపోయినప్పుడు శేషు మామయ్య ఇంట్లో వుండి బ్రతికిపోయి... వాళ్ల అంత్యక్రియలకి వెళ్ళి మళ్లీ దిక్కులేని దానిగా మామయ్య ఇంటికే వచ్చింది. వచ్చాక చాలాసార్లు తను వాళ్లతోపాటు చచ్చిపోతే ఎంత బావుండేదో అనుకుంది. ఉద్యోగం తప్ప మరో ఆధారంలేని వాళ్ళ నాన్న, పాతికేళ్ళొచ్చిన శేషుకి పెళ్ళి చెయ్యలేక పోయాడు. పదోక్లాసు పైకి చదివించలేకపోయాడు. చిన్నదో, చితకదో ఏదైనా ఒక పని చేసుకోనివ్వలేకపోయాడు. ఇంటికైతే తీసుకొచ్చాడు కానీ మామయ్య కూడ పైవేవీ చెయ్యలేకపోయాడు. బుద్ధిమంతురాలయినా, చూడడానికి బాగా వున్నా శేషుని చేసుకోవడానికి మామయ్య కొడుకు ఒప్పుకోలేదు. అత్తయ్యా ఒప్పుకోలేదు. మామయ్య కొడుక్కి అతని సహోద్యోగితో పెళ్ళైనాక అత్తయ్య శేషుకు ఇల్లు అప్పజెప్పేసింది. అమ్మనీ నాన్ననీ వాళ్ళతో గడిపిన పాతికేళ్ళ జీవితాన్ని తలుచుకోవడానికి కానీ, తనెందుకు పోలేదని విచారించడానికి గానీ సమయం దొరక్కుండా రెండు దశాబ్దాలు వంటల్లో, అంట్లగిన్నెల్లో బజారు పనుల్లో హడావుడిగా గడిచిపోతున్నప్పుడు మామయ్యకి గుండె నెప్పొచ్చింది. ఆ గుండెలో స్టెంట్లు పడ్డప్పుడు, మామయ్యతో శేషు హాస్పిటల్‌లో ఉన్నప్పుడు, కాలనీలో వుండే మామయ్య స్నేహితుడు రామారావుగారు చూడ్డానికొచ్చారు,

'నేను పోతే దీన్ని మావాళ్ళు ఈ మాత్రం కూడా చూడరు. తిన్నావా, లేదా అని కూడా అడగరు. తీసుకొచ్చి దాని ఉసురు పోసుకుంటున్నాను' అని కంట తడిపెట్టాడు మామయ్య. రామారావుగారు వరుసగా మూడు రోజులూ వచ్చారు. నాలుగో రోజు ఇంటికొచ్చారు. 'మీ మేనకోడల్ని నేను పెళ్ళి చేసుకుంటాను. పదిరోజులపాటు ఆలోచించి చెప్పండి' అన్నారు.

శేషు బిత్తరపోయింది. కానీ మామయ్య ఆలోచించాడు. 'పెళ్లి ఒక జీవన భృతా మామయ్యా?' అని అడిగిన శేషుని అవునని చెప్పి ఒప్పించాడు. 'ఇక్కడ ఇరవై ఏళ్ళున్నావు... ఏముంది నీకు ? ఆయన నీ జీవితానికొక అసరా కల్పిస్తాడు. మంచి స్వభావం కలవాడు. భాగ్యమ్మగారిని బాగా చూసుకునేవాడు. నామాట విను' అని నెత్తీ నోరూ బాదుకున్నాడు.

'ఆవిడ' ఒకింటి నించీ మరో ఇంటికి వంటమనిషిగా వచ్చిందంటారా ?' అంది రోష్నీ కొంచెం వ్యంగ్యంగా.

వచ్చినప్పుడు అట్లాగే అనుకుంది. తనకో శరీరం వుందని, అది కొంత సుఖాన్ని కోరుతుందని ఎప్పుడో మర్చిపోయిన శేషు, మామయ్య ఇంటికన్న భిన్నమైనదేదీ ఆశించే అవకాశం లేని పెళ్ళి అది. పెళ్లినించీ ఇంకే సుఖాన్నీ ఆశించే వయసూ దాటిపోయింది. పెళ్లి ఒక అసరా.... కానీ ఆయన వంట కోసమే ఆమెని తెచ్చుకోలేదు. ఆమెని పట్టించుకున్నాడు. బ్రతకనిచ్చాడు. కాసేపు విశ్రాంతిగా కూచుని సంగీతం విననిచ్చాడు. పుస్తకాలు చదవనిచ్చాడు. తనకిష్టమైన పని చేసుకోనిచ్చాడు. 'ఇంకా వంట కాలేదా? పిల్లలకి క్యారేజీలు కట్టవా ? నా చీరె కాస్త ఇస్త్రీ చేసిపెట్టు... రోజూ ఈ టిఫినేనా ? రాత్రికి పెసరట్లకి పప్పు నానెయ్, దాంతో అల్లం పచ్చడి చెయ్యి' లాంటి మాటలు మాత్రమే వినడానికి అలవాటుపడ్డ శేషు కలుగులాంటి ప్రపంచాన్ని విస్తృతం చేశాడు. ఆ ప్రపంచాన్ని చూసే కొత్త చూపునిచ్చాడు. శేషుకి ఆయన ప్రతి మాటలో, చేతలో తన తండ్రే కనపడేవాడు. ఆయన అవసరాలు చూడ్డం శేషుకి ఇష్టంగానే వుండేది. ఈ మూడేళ్ళూ ఆయనా, శేషూ ఎంతో స్నేహంగా వున్నారు. ఆయన ఆమెకొక జీవితం ఇచ్చాడు'.

'ఆస్తీ అంతస్తు కూడా ఇచ్చాడు' అంది రోష్నీ, మొహం గంటు పెట్టుకొని,

'ఆవిడ' రోష్నీ కళ్ళల్లోకి చురుగ్గా చూసి 'ఈ ఇల్లు సంగతేగా నువ్వు కూడా మాట్లాడుతున్నావు ? అందరూ అనుకోడం వింటూనే వున్నాను. ఇది నాకివ్వలేదు. నాకివ్వనని చెప్పే పెళ్లి చేసుకున్నారు. పెళ్ళికి ముందురోజే మీ ఇద్దరి పేరా వీలునామా రాశారు. ఎవరికీ చెప్పొద్దన్నారు. నాకు కాస్త ఊపిరి తీసుకునే ఏర్పాటు చేశారు. ముందుచూపు జాస్తి... అందరూ వుండగా చెప్పడం ఇష్టంలేకనే నిన్ను ఉండమన్నాను...' అంటే రోష్నీ తెల్లపోయింది.

" నువ్వు పొమ్మంటే ఈరోజే పోవాలి నేనిక్కడనుంచి" అని నవ్వింది 'ఆవిడ' ఇందాకటి దుఃఖపు జీరలేదు.

"ఇప్పుడు నువ్వు కాస్త స్థిమితంగా వుండొచ్చు" అంది మళ్ళీ.

దుఃఖంతో అక్కడినించీ లేచిపోయింది రోష్నీ. ఆమెకి అర్థంకానిది ఒకటే. అమ్మపోయాక మూడేళ్ళు ఒంటరిగా గడిపిన మనిషి ఆవిడని ఉద్ధరించడానికే పెళ్ళి చేసుకున్నాడా ?

"శేషుని ఉద్ధరించడానికి ఆమెను ఆయన పెళ్ళి చేసుకోలేదు. తనని తను ఉద్ధరించుకోవడానికే చేసుకున్నాడు"

అందావిడ వచ్చి పక్కన కూచుని.

అమ్మాయింట్లోనూ ఊపిరాడలేదు. అబ్బాయింట్లోనూ ఊపిరాడలేదు. పోనీ అని దేశం చుట్టి వచ్చేసరికి ఇల్లు బూజులు పట్టిపోయి బావురుమంటోంది. ఎక్కడికక్కడ రిపేర్లొచ్చాయి. మొక్కలన్నీ చచ్చిపోయాయి. భాగ్యం, పిల్లలతోపాటు ఈ ఇల్లు కూడా తన జీవితంలో ఒక భాగం.... భాగ్యాన్ని తిరిగి తెచ్చుకోలేదు. పిల్లల బ్రతుకులు పిల్లలవి. ఇల్లు వదలలేదు. ఈ ఊరు, ఈ కాలనీ, ఈ ఇల్లు ఇక్కడ తను అలవాటుపడ్డ జీవితం వదలలేదు. ఒంటరిగా ఉండలేడు.... మానవ స్పర్శ కావాలి. అప్పుడే శేషుని చూశాడు. ఆమెని తనతో తెచ్చుకోడానికీ, ఆమె మీద వాళ్లకు హక్కు లేకుండా చెయ్యడానికి పెళ్లి ఒకటే మార్గమనిపించింది. శేషుకీ మామయ్య చెప్పిన దాంట్లో సత్యం తెలుసు. కఠిన కారాగార శిక్షలాంటి జీవితం మామయ్యింట్లో, అంతకుమించిన కష్టాలు ఎక్కడా వుండవు. ఎన్నోసార్లు అక్కడినించీ పారిపోవాలనుకుంది. కానీ వీధినపడ్డ ఆడదాని జీవితాన్ని తలుచుకుని భయపడి ఒక అచ్ఛాదన కోసం నాలుగు గోడల మధ్య భద్రత కోసం ఉండిపోయింది. రామారావుగారితో జీవితం ఒక "సింబియాసిస్"

మరి ఎవరికీ మాటలు పెగలలేదు. దీపక్ ఫోన్ చేశాడు. 'పిల్లలు గొడవ పెడుతున్నారు రేపొస్తున్నాం మాతో వచ్చెయ్' అని, ఆవిడకి చెప్పింది ఆ మాట.

"లాయర్ దగ్గర వీలునామా వుంది తీసుకో.... నీ ఇష్టం .... నన్ను కొంతకాలమైనా ఈ ఇంట్లో ఉండనిస్తే వుంటాను. లేదంటే నువ్వు ఎప్పుడు ఖాళీ చెయ్యమంటే అప్పుడే చేస్తాను" అందావిడ.

"తొందరపడకండి" అని మాత్రమే అనగలిగింది.

"నాన్నని చాలా ప్రేమించానని, గౌరవించానని అనుకున్నాను. అంతా ఒట్టిదే" కారులో కూచున్న రోష్ని కన్నీటి వరదలో తడిసిపోయింది.

ఆ వయసులో పెళ్లి చేసుకున్నాడని అందరితోపాటే విమర్శించి,ఆయన ఫోన్ చేసినప్పుడల్లా వ్యంగ్యంగా మాట్లాడి, ఆయన మీద కోపాన్ని ఆవిడ మీద అసహ్యంగా మార్చుకుని... మొన్న వేసవిలో వచ్చి పదిరోజులుండిపోయాక కూడా ఆ కోపం పోగొట్టుకోలేక పోయి, ఆయన అమ్మని పూర్తిగా మర్చిపోయాడనుకుని ఖరారు చేసుకుని... పిల్లలు చిన్నప్పుడు భార్య చనిపోతే వాళ్లని పెంచడం కోసం మళ్ళీ పెళ్ళి చేసుకోవడం సబబే, కానీ వయసు అయిపోయి మనవరాళ్ళు పుట్టాక పెళ్ళేమిటో అని ఏవగించుకుని, వదినలాగా, అత్తయ్యలాగా మామయ్యలాగా, లోకుల్లాగా.... ఆయన్ని మాటలతో గుచ్చి ఇప్పుడు ఇల్లు ఇచ్చాక పశ్చాత్తాప పడుతోందా? తక్కిన వారికన్న ఉన్నతంగా ఆలోచిస్తున్నామని ఎవరికి వాళ్ళు అనుకుంటారు. కానీ అందరూ సామాన్యులే

'నాన్న ఇల్లు ఆవిడకి రాసివ్వలేదన్నాక తనకి ఆవిడ మీద ఏ కాస్తో సానుభూతి కలగడమూ అలాంటిదేనేమో !ఎప్పుడో ఎవరో సృష్టించిన పాత విలువల్ని ఇంకా అతని మీద రుద్దుతూ... మనుషులు మారుతున్నారనీ, కాలానుగుణంగా, ప్రాక్టికల్‌గా బ్రతకడం నేర్చుకుంటున్నారనీ అర్థం చేసుకోలేక పోతున్నామా ? మొదటినించీ ఆయనకి ఇంట్లో అంతా శన మాటగా వుండేది. ఆయన చెప్పేది అంతా వినేవారు. ఆయన అభిరుచుల్ని గౌరవించేవారు. ఇప్పుడుకూడా ఆయనకాస్థాయి జీవితమే కావాలి. ఆయన ఇల్లు, అందులో ప్రథమ స్థానం, తన జీవనస్థాయి, తన జీవన శైలి ఆయనకి కావాలి. అందుకు ఆయన ఎంచుకున్న మార్గం అది.... అని ఇల్లు ఆవిడకి రాయలేదని తెలిసేవరకూ ఎందుకు అర్థంకాలేదు నాకు?" అనుకుంది రోష్నీ. ఆ మాటే పైకి అంది.

"నువ్వు ఇల్లు ఆశించడంలో అసహజమేమీ లేదు. అందులో సిగ్గుపడ్డానికి బాధపడ్డానికీ ఏమీలేదు. మనం ఎంత సెంటిమెంట్ రంగులు పూసుకున్నా ఆస్తుల ప్రభావం మన మీదా అంత గట్టిగానూ వుంటుంది. నిజానికి ఆయనకి ఆస్తి వుండబట్టే ఎవరి మాటల్నీ లక్ష్యపెట్టక పెళ్ళి చేసుకోగలిగాడు. ఆస్తి అంటూ లేకపోతే జీవనస్థాయిలూ, ప్రత్యేక జీవన శైలులూ అంటూ ఏమీ వుండవు. అవన్నీ ఈ దేశంలో ఎంతమందికున్నయ్ ? ఎక్కడికక్కడ సర్దుకుపోవడమే! ఈ ఇల్లు వ్రాసిచ్చినట్లు ముందే తెలిసుంటే మీ అన్నయ్యా, నువ్వూ ఆయనకి వృద్ధాప్యంలో మీకు బదులు సేవచెయ్యడానికి ఒక మనిషి దొరికిందని సంతోషించేవాళ్ళేమో! ఆవిడని మీరంతా ఇంత చీదరించుకునే వాళ్ళు కాదేమో! అదింక వదిలెయ్... ఇప్పుడేం చేస్తావో ఏ విలువలతో ప్రవర్తిస్తావో ఆలోచించుకో" అంటున్నాడు దీపక్.

కళ్ళు తుడుచుకుని వెనక్కి వెళ్ళిపోతున్న పొలాలనూ పైన కదులుతున్న తెల్లటి దూది మబ్బుల్ని చూస్తూ కార్లో వెనక్కి జారపడింది రోష్ని.

**(మెలకువ - కథలు నుండి)**

**ఆ వయసులో పెళ్లి చేసుకున్నాడని అందరితోపాటే విమర్శించి,ఆయన ఫోన్ చేసినప్పుడల్లా వ్యంగ్యంగా మాట్లాడి, ఆయన మీద కోపాన్ని ఆవిడ మీద అసహ్యంగా మార్చుకుని... మొన్న వేసవిలో వచ్చి పదిరోజులుండిపోయాక కూడా ఆ కోపం పోగొట్టుకోలేక పోయి, ఆయన అమ్మని పూర్తిగా మర్చిపోయాడనుకుని ఖరారు చేసుకుని... పిల్లల చిన్నప్పుడు భార్య చనిపోతే వాళ్లని పెంచడం కోసం మళ్ళీ పెళ్ళి చేసుకోవడం సబబే, కానీ వయసు అయిపోయి మనవరాళ్ళు పుట్టాక పెళ్ళేమిటో అని ఏవగించుకుని, వదినలాగా, అత్తయ్యలాగా మామయ్యలాగా, లోకుల్లాగా.... ఆయన్ని మాటలతో గుచ్చి ఇప్పుడు ఇల్లు ఇచ్చాక పశ్చాత్తాప పడుతోందా ? తక్కిన వారికన్న ఉన్నతంగా ఆలోచిస్తున్నామని ఎవరికి వాళ్ళు అనుకుంటారు. కానీ అందరూ సామాన్యులే**

## ప్రపంచ ఆర్థిక సంక్షోభం

# భారత మహిళలపై ప్రభావం

**(ఐద్వా 9వ జాతీయ మహాసభ కమిషన్ పేపర్)**

కార్మిక వర్గంలో ఎక్కువ భాగం అసంఘటిత రంగంలోనూ, స్వయం ఉపాధి కార్మికులుగానూ, అస్థిరమైన ఉపాధి పనులలోనూ ఉన్నారు. శ్రామిక మహిళలలో ఈ భాగం ఇంకా అధికంగా ఉంది. చాలా ప్రాంతాలలో వ్యవసాయం గడ్డు పరిస్థితులలో ఉంది. అయినా కూడా వ్యవసాయ రంగంలోనే ఎక్కువగా పని చేస్తున్నారు. అందులో పనిచేస్తున్న మహిళల శాతం కూడా ఎక్కువగా ఉంది. వ్యవసాయ సంక్షోభం ఆహార సంక్షోభంతో ముడిపడి ఉంది. దీని ప్రభావంతో చాలా దేశాలు ఆహారం విషయంలో స్వయం సమృద్ధిగా లేకపోవడమే కాక ధరల పెరుగుదల కూడా అధికంగా ఉంది.

చాలా దేశాలలో కార్మిక వర్గంలో ఎక్కువ శాతం మంది అసంఘటిత రంగంలోనూ, స్వయం ఉపాధి కార్మికులుగానూ, అస్థిరమైన పనులలోనూ ఉన్నారు. శ్రామిక మహిళలలో ఈ భాగం ఇంకా ఎక్కువగా ఉంది. భారతదేశంలోని సామాజిక పరిస్థితులపై ఆర్థిక సంక్షోభ ప్రభావం లెక్కల్లో చూపిన దానికంటే తీవ్రంగానే ఉంది. కనుక సంక్షోభ ప్రభావం మహిళల సామాజిక, ఆర్థిక జీవనంపై ప్రత్యక్షంగా, పరోక్షంగా తీవ్ర ప్రభావం చూపుతుంది. మహిళలు సంఘటితమై యూనియన్లు ఏర్పరచుకోవడం తక్కువ కనుక వారు సులభంగా ఉద్యోగాల నుండి తొలగించబడుతున్నారు. సంక్షోభ ప్రభావం శ్రామిక మహిళలపైనే కాక ఏ వేతనం లేకుండా ఇంటి పనులు చేసే మహిళలపై కూడా మరింత భారం మోపుతుంది.

పెరుగుతున్న ధరలతో పోటీ పడలేక మహిళలు తాము తీసుకొనే ఆహారంలో కొంత త్యాగం చేసి కుటుంబ సభ్యులకు పెడుతున్నారు. అసంఘటిత రంగంలో చెత్త సేకరణదారులపై సైతం ప్రపంచ మార్కెట్ సంక్షోభ ప్రభావం పడుతుందంటే విస్మయం కలుగక మానదు. కుటుంబ భారం మోసే కొంతమంది మహిళలు సంక్షోభ ఫలితంగా తమ శరీరాలను వైద్య ప్రయోగాలకు అమ్ముకునే దుస్థితి ఏర్పడింది. ఇంతేకాక ఆర్థిక సమస్యలు, ఉపాధి కోల్పోవడం, అభద్రతా భావం పెరగడంతో అసహాయ స్థితిలో ఉన్న పురుషులు తమ కోపాన్నీ, ఆగ్రహాన్ని కుటుంబంలోని మహిళలపై ప్రదర్శించడంతో రకరకాల పద్ధతులలో లైంగిక వేధింపులు, హింస పెరుగుతున్నాయి. దీనితో మహిళలలో ఒత్తిడి పెరిగి మానసిక సమస్యలు కూడా పెరుగుతున్నాయి.

**భారతదేశంలోని వివిధ రంగాల మహిళలపై ఈ సంక్షోభ ప్రభావం ఏవిధంగా ఉందో అధ్యయనం చేసి ఐద్వా సమర్పించిన నివేదిక పత్రం**

2008-09 సం॥లలోని ప్రపంచ ఆర్థిక మాంద్యాన్ని భారతదేశంలోని విధాన నిర్ణేతలు తక్కువ అంచనా వేస్తున్నారు. ఒక బలమైన ఆర్థిక వ్యవస్థ ఏర్పడే అభివృద్ధి క్రమంలో అది ఒక చిన్న అంతరాయం మాత్రమేనని వారు భావిస్తున్నారు. స్థూల జాతీయోత్పత్తి విషయంలో (జిడిపి) ఆసియాలోని కొన్ని అభివృద్ధి చెందుతున్న దేశాలతోపాటుగా భారతదేశం ముందుగా సంక్షోభం నుండి బయట పడింది. నిజానికి ఇతర అనేక దేశాలలో మాదిరిగా జిడిపి అభివృద్ధి ఎప్పుడూ పడిపోలేదు. వేగంలో మాత్రం తగ్గుదల కనిపించింది. ప్రస్తుతం ఇతర అనేక ప్రాంతాలు కూడా కొంత కోలుకుని అభివృద్ధిలో పురోగమనంలో ఉన్నాయి. దీనితో ప్రపంచ ఆర్థిక వ్యవస్థ సంక్షోభం నుండి బయటపడినట్లేననీ, ఇంతకు ముందులాగే అభివృద్ధి కొనసాగుతుందనే ఆలోచనలు ఏర్పడుతున్నాయి.

కానీ ఈ సంక్షోభం నుండి బయట పడటం తాత్కాలికం మాత్రమే. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ తిరిగి సంక్షోభంలోకి నెట్టబడే ప్రమాదం రోజు రోజుకూ పెరుగుతుంది. ప్రస్తుతం ఆర్థిక మార్కెట్లకు సంబంధించిన ముఖ్యమైన అంశాలు పెరుగుతున్న ప్రభుత్వ అప్పు సమస్యతో ముడిపడి ఉన్నాయి.

పెద్ద పెద్ద బ్యాంకులు, సంస్థలు తమ తమ వ్యాపారాలలో దెబ్బతిని సంక్షోభంలో కూరుకుపోయినప్పుడు చాలా దేశాలలో ప్రభుత్వాలు వాటికి బెయిల్ అవుట్ (ఉద్దీపన) ప్యాకేజీల ద్వారా ప్రభుత్వ ఖజానా నుండి పెద్ద మొత్తాలు వాటికి కేటాయించాయి. దీనితో ప్రభుత్వ అప్పు పెరిగింది.

ప్రభుత్వం నుండి భద్రతను ఆశించే ఆర్థిక శక్తులు ప్రజాసంక్షేమానికి ప్రభుత్వాలు పెట్టే ఖర్చును తగ్గించుకోవాలని ప్రభుత్వాన్ని ఒత్తిడి చేస్తున్నాయి. దీనితో ప్రతిచోటా ఎంతో ముఖ్యమైన సామాజిక అవసరాలు ఉన్నా

**ఇంటికి సంబంధించిన పనులను శుభ్రం చేయడం, ఊడ్వడం, ఉతకడం లాంటివి ఇళ్ళలో పనిచేసేవారిని తొలగించి మహిళలే చేయాల్సివస్తుంది. అనారోగ్యానికి గురైనవారినీ, పిల్లలనూ మహిళలే చూసుకోవాల్సి వస్తుంది. అంతేకాక పొలాల నుండి కూరగాయలు, పండ్లు, ఆకుకూరలు తెచ్చే పనికూడా మహిళలే చేస్తున్నారు. ఇవన్నీ వేతనం లేని పనులే. ఈ విధంగా ఇళ్ళలో చేసే వేతనం లేని పనిమహిళలకు మూడింతలు పెరిగిందని ప్రభుత్వ శాంపిల్ సర్వేలో తేలింది.**

కూడా ప్రభుత్వాలు పెట్టాల్సిన ద్రవ్య పెట్టుబడులను పొదుపు చర్యల ద్వారా తగ్గించుకుంటున్నాయి. ఇటువంటి పొదుపు చర్యలు అవసరం లేని దేశాలు కూడా అదే పద్ధతులు పాటించడంతో పరిస్థితులు మరింత దిగజారుతున్నాయి.

అంతర్జాతీయంగా పెట్టుబడిదారీ వ్యవస్థ సంక్షోభానికి కారణమైన మూడు ముఖ్యమైన అంశాలు ఇప్పటికీ పరిష్కారం కాలేదు.

**(1)** ఫైనాన్స్ పెట్టుబడికీ నిజ ఆర్థిక వ్యవస్థకు మధ్య అసమతుల్యం ఏర్పడింది. దీనితో వాస్తవానికి ఉత్పత్తి కార్యకలాపాలతో సంబంధం లేకుండానే అన్ని దేశాలలోనూ ఆర్థిక రంగంలో పెద్ద ఎత్తున అభివృద్ధి కనిపించింది. ఈ పెరుగుదల వలన రాజకీయంగా కూడా ఆర్థిక రంగం బలం పెరిగింది. దీనితో సాధారణంగానే ఈ రంగం ప్రభుత్వంపై ఒత్తిడి పెంచి ఆర్థిక శక్తుల బలం మరింత పెరగడానికి దోహదపడే విధానాలను అవలంభించేలా చేస్తుంది. అందువలననే ఈ మధ్య ఏర్పడిన ప్రపంచ సంక్షోభానికి ఫైనాన్సే కారణమైనప్పటికీ అది ఏమాత్రం నష్టపోకుండా సంక్షోభం నుండి బయటపడి తిరిగి ఎప్పటిలాగే శక్తిని సంతరించుకుంది. కానీ వేరొకవైపు ఈ సంక్షోభం వలన కార్మికులు మూల్యం చెల్లించుకోవలసి వస్తుంది. కార్మికులు తమ ఉద్యోగాలు కోల్పోవడం, వేతనాలలో కోతలు మరియు ప్రభుత్వ సేవల కుదింపులతో అనేక నష్టపోయారు.

**(2)** అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థలో కీలక పాత్ర పోషించే అతి పెద్ద శక్తుల మధ్య ఏర్పడిన ఆర్థిక అసమతుల్యత. అభివృద్ధి వేగంగా ఉన్న కాలంలో ప్రపంచానికి అమెరికా సారథిలా పనిచేసింది. అప్పుడు మిగిలిన అన్ని దేశాలూ అక్కడికి తమ ఎగుమతులు పంపడానికి పోటీ పడ్డాయి. అందువలన అమెరికాలోనే అధికంగా వాణిజ్య లోటు ఏర్పడింది. అందువలన ప్రపంచంలోని అన్ని ప్రాంతాల నుండి అతి పేదదేశాలతోసహా అమెరికాకు ద్రవ్య పెట్టుబడులు సమకూర్చాల్సి వస్తుంది. నిజానికి ఆసియాలోని అభివృద్ధి చెందుతున్న దేశాలు భారత దేశంతో సహా అమెరికా వాణిజ్య లోటును పూడ్చడానికి పెద్ద ఎత్తున ఆర్థిక సహకారం అందించాల్సి వచ్చింది. అవి అమెరికా ప్రభుత్వ బాండ్లలో తమ విదేశీ మారక ద్రవ్యనిల్వలను ఉంచడం ద్వారా ఈ సహకారం అందించాయి. భారతదేశం, చైనా మరియు ఇతర అనేక పేద దేశాల ప్రజలు అమెరికా ప్రభుత్వం పెడుతున్న ఖర్చులకు, అది చేసే యుద్ధ ఖర్చులకు కూడా ద్రవ్య పెట్టుబడులు సమకూర్చాల్సి వస్తుంది. ఈ పరిస్థితులలో ఇప్పుడే మార్పు ఏమీ కనిపించడంలేదు. దీని వలన నిజానికి అమెరికాలో ఇప్పటికే వాణిజ్య లోటు తగ్గుముఖం పట్టింది. అందువలన ప్రస్తుతానికి ప్రపంచాన్ని అభివృద్ధి పథంలో నడిపే ప్రత్యామ్నాయ శక్తి కనిపించడంలేదు. కరెన్సీ రేట్లలో వివాదాలు, వాణిజ్య లావాదేవీలలో వివాదాలు పెరగడానికి ఇదికూడా ఒక కారణం.

**(3)** ఒక క్రమ పద్ధతిలో లేని అభివృద్ధి వలన పర్యావరణ అసమతుల్యత ఏర్పడింది. దీనితో కాలుష్యం పెరగడంతోపాటు వాతావరణ మార్పులు కూడా సంభవించాయి. ఇవి భవిష్యత్ అభివృద్ధికి ప్రతిబంధకాలుగా మారుతున్నాయి. వాతావరణ మార్పులే కాక ఇతర పర్యావరణ సమస్యలు కూడా అభివృద్ధికి ఆటంకాలుగా మారే పరిస్థితులు పెరుగుతున్నాయి.

ఈసమస్యలను పరిష్కరించకుండా ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో నిలకడైన అభివృద్ధిని సాధించడం సాధ్యంకాదు. ఈ ప్రతికూల వాతావరణం నుండి భారతదేశానికి మినహాయింపు ఉంటుందని అశించలేము. అంతేకాక ఈ సమస్యల పరిష్కారం వివిధ దేశాలలోని సంక్షోభ తీవ్రత మరియు ఆ సంక్షోభ కాలపరిమితులపై ఆధారపడి ఉంటుంది. సంక్షోభం తగ్గుముఖం పట్టినట్లు పైకి కనిపించినా, ఈ సమస్యల తీవ్రత మరింత పెరిగిందేకాని తగ్గడంలేదు. ఉపాధి అవకాశాల మెరుగుదల విషయంలో కానీ, వేతనాల విషయంలోకానీ, స్వయం ఉపాధి కార్మికుల జీవన ప్రమాణాల మెరుగుదలలోకానీ అభివృద్ధి కనపడటంలేదు. ఇంతేకాక ఇంకొన్ని ప్రతికూల పరిస్థితులు కూడా ఏర్పడుతున్నాయి.

ఏది ఏమైనప్పటికీ భారతదేశ సామాజిక పరిస్థితులపై ఈ ఆర్థిక సంక్షోభం తీవ్రత లెక్కలలో చూపిన దానికంటే చాలా తీవ్రంగా ఉంది. ఎగుమతులలో నెలకొన్న అనిశ్చిత పరిస్థితులు ఉపాధిపై ప్రత్యక్ష, పరోక్ష ప్రభావాలు కలిగిస్తున్నాయి. దేశం లోని జనాభాలో అతి పెద్ద భాగం ఇంకా కడు పేదలుగానే ఉన్నారు. కొన్ని దేశాలు మినహాయించి చాలా దేశాలలో

కార్మిక వర్గంలో ఎక్కువ భాగం అసంఘటిత రంగంలోనూ, స్వయం ఉపాధి కార్మికులుగానూ, అస్థిరమైన ఉపాధి పనులలోనూ ఉన్నారు. శ్రామిక మహిళలలో ఈ భాగం ఇంకా అధికంగా ఉంది. చాలా ప్రాంతాలలో వ్యవసాయం గడ్డు పరిస్థితులలో ఉంది. అయినా కూడా

వ్యవసాయ రంగంలోనే ఎక్కువగా పని చేస్తున్నారు. అందులో పనిచేస్తున్న మహిళల శాతం కూడా ఎక్కువగా ఉంది. వ్యవసాయ సంక్షోభం ఆహార సంక్షోభంతో ముడిపడి ఉంది. దీని ప్రభావంతో చాలా దేశాలు ఆహారం విషయంలో స్వయం సమృద్ధిగా లేకపోవడమే కాక ధరల పెరుగుదల కూడా అధికంగా ఉంది.

సహజంగానే ఈ విధానాల దుష్ప్రభావాలు ఆయా దేశాలలో ప్రజలపై, ముఖ్యంగా శ్రామికులపై పడుతున్నాయి. అవి ఉపాధి అవకాశాలు దెబ్బతినడం, నిజ వేతనాలు పడిపోవడం, స్వయం ఉపాధి పనులలో ఆదాయాలు తగ్గిపోవడం, వలస విధానాలలో మార్పులు రావడం, ఆహార ధరల పెరుగుదల వలన ఆహార వినియోగం తగ్గడం, ఆరోగ్య సదుపాయాలు పొందలేకపోవడం, విద్య అందుబాటులో లేకపోవడం, సామాజిక ఒత్తిడిలు పెరగడంతో రకరకాల పద్ధతులలో హింస పెరగడం, మొదలైన దుష్ప్రభావాలు పడుతున్నాయి.

సంక్షోభ ప్రభావం ప్రజలందరిపై ఒకే విధంగా లేదు. బాలికలు, మహిళలపై ఎక్కువగా ఉంది. ఆర్థిక రంగం అభివృద్ధి పథంలో ఉన్నప్పుడు దాని ఫలితాలను చివరి వరుసలో అందుకునే అణగారిన వర్గాలు అది సంక్షోభంలో ఉన్నప్పుడు మాత్రం తీవ్రమైన దాని చేదు ఫలితాలను ముందుగా చవిచూడాల్సి వస్తుంది. వేతనాలలో కోతలు, ఉపాధి అవకాశాలు లేకపోవటం, ప్రభుత్వం నుండి పొందాల్సిన నిత్యావసర వస్తువుల సరఫరా, సేవలు కోల్పోవడం వంటి సమస్యలను వారు ఎదుర్కొంటున్నారు. ఇది సమాజంలోని ఆర్థిక జీవనంలో ప్రతినిత్యం ఎదురవుతున్న విచారకరమైన అంశం.

**వేతనాలు పొందే ఉపాధి అవకాశాలు తగ్గిపోవడంతో మహిళలు ఉప కాంట్రాక్టుల ద్వారా నడిచే గృహ పరిశ్రమలవైపు కానీ లేక చిన్న చిన్న యూనిట్లుగా ఉన్న కంపెనీలలో కానీ పనిచేస్తున్నారు. సాధారణంగా వీరికి పీస్‌రేట్ పద్ధతిలో కానీ లేక అతి తక్కువ వేతనాలు కానీ చెల్లిస్తున్నారు. వీరికి అదనపు సౌకర్యాలేవీ అందుబాటులో ఉండవు.**

సామాజిక, ఆర్థిక అంశాలకు లింగ వివక్ష కూడా తోడవడంతో ఆయా ప్రాంతాలు, వర్గాలు, సాంఘిక పరిస్థితులు, వృత్తులను బట్టికూడా మహిళలు, బాలికలను నిర్లక్ష్యం చేయడం జరుగుతుంది, సంక్షోభ తీవ్రతకూడా పురుషుల కంటే మహిళలపై ఎక్కువ ప్రభావం చూపిస్తుంది. సాంఘికంగా మహిళలకున్న పునరుత్పత్తి బాధ్యతల రీత్యా వారు అత్యంత అభద్రత ఉన్న ఉపాధి పనులలో భాగస్వాములవుతున్నారు. సంక్షోభం తలెత్తి రెండు సంవత్సరాలు పైబడింది. ఈ సందర్భంలో మహిళలపై సంక్షోభ ప్రభావం వివిధ రీతుల్లో ఒకదానిపై ఒకటి వరుసగా ఎలాంటి ప్రభావాలు చూపెడుతున్నాయో పరిశీలించాలి. శ్రామిక మహిళలుగా, స్వయం ఉపాధి మహిళలుగా, వేతనాలు లేని కార్మికులుగా, కుటుంబ సభ్యులుగా, హక్కులున్న కార్మికులుగా, అవసరాలు, ఆశయాలు, కోరికలు ఉన్న వ్యక్తులుగా మహిళలు ఏవిధమైన పరిస్థితులెదుర్కొంటున్నారో పరిశీలించాలి.

### శ్రామిక మహిళలుగా

తయారీ రంగంలో పనిచేస్తున్న శ్రామిక మహిళలు తోటి పురుషులకంటే ఎక్కువగా నష్టపోవాల్సి వస్తున్నది. మహిళలు పనులు కోల్పోవడం, వేతనాలలో కోతలు లాంటి సమస్యలెదుర్కొంటున్నారు. మహిళలెక్కువగా పనిచేస్తున్న టెక్స్‌టైల్స్ పరిశ్రమలలో రెడీమేడ్ దుస్తుల పరిశ్రమలలో ఈ సంక్షోభ ప్రభావం తీవ్రంగా ఉంది. ఉత్పత్తిలో కొంత మెరుగుదల కనిపించిన తరువాత కూడా ఉపాధి అవకాశాలు పూర్వ స్థాయికి రాలేదు. ప్రతికూల పరిస్థితుల వలన వ్యాపార పోటీలో యజమానులపై మరింత ఒత్తిడి పెరిగింది. దీనితో యజమానులు కార్మికులకు వేతనాలు తగ్గించడం ద్వారా ఖర్చులు తగ్గించుకోవడం, కార్మికుల సంఖ్యను కుదించడం, మిగిలిన కార్మికులను తక్కువ వేతనాలతో ఎక్కువ పని గంటలు పనిచేయించడం లాంటి చర్యలకు పాల్పడుతున్నారు.

ఏది ఏమైనప్పటికీ మహిళలు సంఘటితంగా యూనియన్లు ఏర్పర్చుకోవడం తక్కువ. కనుక వారు సులభంగా ఉద్యోగాల నుండి తొలగింపబడుతున్నారు. తక్కువ వేతనాలు లభించే పనులలోనే నియమించబడుతున్నారు. అంతేకాక పురుషుల వలె విస్తృత ఉపాధి అవకాశాలుకానీ, భద్రత కలిగిన పని పరిస్థితులు కానీ మహిళలకు ఉండడం లేదు. మహిళలు ఉపాధి అవకాశాలు కోల్పోవడం కుటుంబ ఆదాయాలపైననే కాక ఇంటా, బయటా వారి సంబంధాలపై కూడా ప్రభావం చూపిస్తుందనేది ఒక ముఖ్యమైన అంశం.

సశేషం

## మరో ప్రపంచం

తెల్ల కాగితం పాప మానసం
బిందు రూపమై చేరె భావనం
మంచి భావనం, మనో చేతనం
బాగు బాగని తెలిపె నింగితం
సాగిపొమ్మని పలికె సమ్మతం
మంచి భావనల్ చేరె నోక్రమం
రోజు రోజుకూ ఎదిగె నా క్రమం
క్రమ క్రమంగా నిండె కాగితం - పాప మానసం
పరిమళించెను పాప వర్తనం
పొంగి పొరలుతూ ఆయె తరంగం
మనసు మనసునూ తట్టె తరంగం
కలసి కట్టుగా ఆయె సాగరం - భావజాల సాగరం!
ధాత్రినంతనూ ముంచె సాగరం - భావజాల సాగరం!
కొత్త కొత్తగా పుట్టె ప్రపంచం
మరోప్రపంచం, మంచి ప్రపంచం

డా॥ డి.ఎల్. విద్య

# మీ సమస్య మాది...!

## కుటుంబ న్యాయ సలహాకేంద్రం, మోటూరు ఉదయం ట్రస్టు

-శాంతిశ్రీ



వర్తమాన జీవనవిధానం, సమాజంలోని మార్పులు కుటుంబవ్యవస్థను అతలాకుతలం చేస్తున్నాయి. వ్యక్తి స్వామ్యంతో చిన్న విషయాలకే సంసారాల్ని విచ్ఛిన్నం చేసుకుంటున్న పరిస్థితులు ఎక్కువవుతున్నాయి. ఆధునిక సమాజంలో సంసారాలు విచ్ఛిన్నమవుతుండడానికి కారణాలేమిటి ? నేటి యువతరంలో, తల్లిదండ్రుల్లో ఎలాంటి మార్పులొస్తున్నాయి ? ఇవన్నీ సమాజంలో ప్రతి ఒక్కరికీ ఎదురవుతున్న ప్రశ్నలే.

ఇటీవల కాలంలో ప్రధానంగా ఐ.టి. ఉద్యోగులు, సాఫ్ట్‌వేర్ రంగంలో స్థిరపడిన కుటుంబాల నుండి వచ్చినవారు కుటుంబ న్యాయసలహా కేంద్రాలకు వస్తున్నారు. ఇది ఆశ్చర్యపరిచే వాస్తవం. ఎటువంటి సమస్యలు ఎక్కువగా వస్తున్నాయన్నది పరిశీలిస్తే , 30శాతం కేసులు తాగుడు వల్ల వచ్చినవే. మిగిలిన 70శాతం కేసులు ఆర్థిక అంశాలతో సంబంధం లేకుండా కేవలం అవగాహన,ఆధిపత్యం చలాయించాలనే ధోరణులు, అర్థం చేసుకోవడంలో లోపం వల్ల వచ్చిన సమస్యలే అధికం. ఇవి రానురానూ పెరగడం అత్యంత ఆందోళన కలిగిస్తున్నాయి. విద్యావంతుల్లోనే ఈ అవగాహన అతి తక్కువగా ఉంది. అలాగే తాగుడు వంటి అలవాటు ఏమీ చదువుకోని నిరక్షరాస్యుల్లో ఉంటాయని సహజంగా అనుకుంటాం. కానీ వాటన్నింటినీ పటాపంచలు చేస్తూ మధ్యతరగతి, బాగా చదువుకున్నవారే దీనికి బానిసలవుతున్నారు. నిశితంగా పరిశీలిస్తే చిన్న విషయాలకే విడిపోవాలన్న నిర్ణయానికి వస్తున్న వారే ఎక్కువ. చిన్న సర్దుబాటుతో చక్కబడే అంశాలే ఎక్కువ. తల్లితండ్రుల్ని పట్టించుకోకుండా వదిలేస్తే పిల్లలతో కలపమని వచ్చే వృద్ధుల సంఖ్యా ఎక్కువే. ఇది ఆందోళనకర అంశం.

"గత మూడేళ్లలో మేము 341 కేసుల్ని పరిశీలించాం. వీటిల్లో ప్రధానంగా 120 కేసులు కేవలం ఐటి ప్రొఫెషనల్స్‌వే' అని మోటూరు ఉదయం కుటుంబ న్యాయ సలహా కేంద్రం కో-కన్వీనర్ మాధవీలత అన్నారు.

గతంలో మధ్యతరగతి, చదువుకున్న కుటుంబాల నుండి ఇలాంటి సమస్యల గురించి బయటకు రావటానికి బిడియపడే వారు, ఒకింత అవమానంగా

వర్తమాన జీవనవిధానం, సమాజంలోని మార్పులు కుటుంబవ్యవస్థను అతలాకుతలం చేస్తున్నాయి. వ్యక్తి స్వామ్యంతో చిన్న విషయాలకే సంసారాల్ని విచ్ఛిన్నం చేసుకుంటున్న పరిస్థితులు ఎక్కువవుతున్నాయి. ఆధునిక సమాజంలో సంసారాలు విచ్ఛిన్నమవుతుండడానికి కారణాలేమిటి ? నేటి యువతరంలో, తల్లిదండ్రుల్లో ఎలాంటి మార్పులొస్తున్నాయి ? ఇవన్నీ సమాజంలో ప్రతి ఒక్కరికీ ఎదురవుతున్న ప్రశ్నలే.




భావించేవారు, ఆ కుటుంబాలవారు కూడా ఇప్పుడు న్యాయ సలహాలకు వస్తున్నారు.

అయితే కౌన్సిలింగ్ కేంద్రాల ద్వారా కాపురాలన్నీ చక్కబడుతున్నాయనీ అనుకోలేం. కాకపోతే వారికి సమస్యల పట్ల అవగాహన మాత్రం ఏర్పడుతుంది. అలాగే ఆర్థిక సమస్యలు, అసలు కారణాల్ని, కారకుల్ని పక్కనపెట్టేసి ఆలుమగలు తగాదాలు పడుతున్న వాస్తవాన్ని వారికి తెలియజెప్పేలా కౌన్సిలింగ్ కేంద్రాలు ఉండటం వల్ల వారికీ, సమాజానికి ఉపయోగకరం.

"అవును. మా దగ్గరకు వచ్చి వెళ్లిన భార్యభర్తలు ఎలాంటి సమస్యలూ లేకుండా జీవిస్తున్నారని మేం చెప్పడంలేదు. కాకపోతే మా కేంద్రం పేరుకు తగినట్లే కుటుంబ వాతావరణాన్ని చక్కదిద్దడానికి ఎక్కువ ప్రయత్నం చేస్తుంది. ప్రధానంగా వారిద్దరి ఉమ్మడి శత్రువు అయిన సామాజిక, ఆర్థికాంశాలు వారిచే గుర్తింపజేస్తున్నాం. ఆ క్రమంలోనే వారికి కౌన్సిలింగ్ చేస్తున్నాం. ఇందులో మేము సఫలమయ్యాం" అని చెప్పారు ట్రస్టు రాష్ట్ర సహాయ కార్యదర్శి డి. ఇందిర.

మూడేళ్ళలో 4,000 కుటుంబాల్లో సత్సంబంధాలు నెలకొల్పేందుకు ప్రయత్నం చేసింది. మా ట్రస్టు తీర్పు చెప్పడంలాగా కాకుండా, వాళ్ళ సమస్య వాళ్ళు గుర్తించేవిధంగా చేయడం వల్ల మమ్మల్ని వాళ్ళ శ్రేయోభిలాషులుగా గుర్తించారు. వాళ్ళ సమస్యలేంటో విడమర్చి చెప్పి, వాళ్లే ఎలా పరిష్కరించుకోవచ్చో గుర్తింపజేశాం, సమస్యల్లోని తీవ్రతను తగ్గించాం" అని సలహా కేంద్రం సభ్యురాలు కోమలి అన్నారు.

**వ్యక్తిగత ప్రాధాన్యాల చుట్టూ...**

యువతరంలో కొంత మంది అబ్బాయిలు,అమ్మాయిలు వ్యక్తిగతానికి ప్రాధాన్యమిచ్చి, పక్కనే జరుగుతున్న విషయం పట్ల స్పందించడం లేదు. ఈ ధోరణితో వారు వ్యక్తిగతంగా కూడా నష్టపోతున్నారు. ఈ ధోరణి వల్ల వివాహానంతరం తమ గురించి ధ్యాసే తప్ప భర్త గురించి భార్య, భార్య గురించి భర్త ఆలోచించడానికి ప్రాధాన్యమివ్వడం లేదు.

ఇవాళ అమ్మాయిల్లో ప్రశ్నించే ధోరణి పెరుగుతోంది. ఇది మంచి పరిణామమే. కాని కొందరు దాన్ని సానుకూల వైఖరిలో ఉపయోగించడం లేదు. "మగవాళ్లకే ఆడ స్నేహితులుండాలా? ఆడవాళ్లకు మగ స్నేహితులుండకూడదా ?" వంటి ప్రశ్నలతో సమస్యకు పరిష్కారం బదులు ఇగోలకు పోయి, తీవ్ర నిర్ణయాలు తీసుకుంటున్నారు. ఇది చాలా ప్రమాదకరం. దీన్ని గమనించి, వారికి దిశానిర్దేశం చేయాల్సిన బాధ్యత పెద్దల పైనా, సమాజం పైనే ఉంది.

**తల్లితండ్రుల బాధ్యత**

కొన్నిసార్లు చాలా సమస్యలకు మూలం తల్లితండ్రులే అవుతున్నారు. ఇవాళ తల్లితండ్రులిద్దరూ ఉద్యోగస్థులై సంపాదిస్తున్నారు. ఇద్దరూ పోటీ ప్రపంచంలో ఉంటున్నారు. పిల్లల భవిష్యత్తుకు సంబంధించి ప్రణాళిక వేసుకుంటున్నారు. వారిని ఫలానా చదువు చదివించాలి ? దానికింత సంపాదించాలనే తాపత్రయంలో ఉంటున్నారు. కొందరు తల్లిదండ్రులు అందుకుఅవసరమైన సంపాదన కోసం నైతిక విలువలు విస్మరించడానికీ వెనుకాడటం లేదు. దీని ప్రభావం పిల్లల మీద పడుతుంది. వారు కూడా విలువలులేకుండా పెరిగి, డబ్బు చుట్టూనే ఆలోచనలు చేస్తున్నారు. దీనివల్ల ఇద్దరి మధ్య అనుబంధాల్లో అవగాహన లేమి, అభిప్రాయభేదాలు తలెత్తుతున్నాయి. "నేడు వ్యష్టి కుటుంబాలు వచ్చాక ఇంట్లో పెద్దవాళ్లు లేక ఏం చేసినా మనల్ని ఎవరేమంటారులే" అనే ధోరణి ఒకటి బాగా కనిపిస్తుంది. దీనితో అనేక తప్పుడు మార్గాలవైపు వెళుతున్నారు. అవినీతి, అక్రమసంబంధాలు వంటివి కూడా తప్పుగా అనుకోవడం లేదు. ఇది చాలా ప్రమాదకరం" అని ప్రముఖ మనస్తత్వ నిపుణులు డాక్టర్ పద్మజ అన్నారు.

"వర్తమాన సమాజంలో మహిళలకు రక్షణ కూడా అవసరం. పిల్లల్ని పెంచేటప్పుడు ప్రధానంగా ఆడపిల్లల విషయంలో కెరీర్‌కే ప్రాధాన్యమివ్వకుండా బాధ్యతగా ఎలా మెలగాలి ? సమస్య వచ్చినప్పుడు ఎలా పరిష్కరించుకోవాలి ? సర్దుబాట్లు ఎలా చేసుకోవాలి అనేది తల్లితండ్రులే నేర్పాలి" అని సలహాకేంద్ర కన్వీనర్ ఎం.ఎస్. లక్ష్మీదేవమ్మ అన్నారు.

**సామాజిక చైతన్యమే కీలకం**

సమాజానికీ, కుటుంబానికీ సంబంధం లేదనుకొని చాలా మంది

భ్రమపడుతుంటారు. ప్రతి కుటుంబమూ సమాజంతో సంబంధం కలిగే ఉంటుంది. సామాజిక చైతన్యం లేకుండా ఏదీ పరిష్కారం కాదు. ప్రభుత్వం విచ్చలవిడిగా బెల్టుషాపులకు అనుమతివ్వడం, అదుపు లేకుండా ధరలు పెంచడం వల్ల ఆర్థికంగా నష్టపోతున్నాం. కానీ దీనికి అసలు కారణమైన ఈ ప్రభుత్వాన్ని వదిలి, వాళ్లల్లో వాళ్లే తగాదాలు పడి, కుటుంబాలు విచ్ఛిన్నం చేసుకుంటున్నారు. ఈ నేపథ్యంలో సామాజిక చైతన్యమే కీలకం. ఎవరి పరిధిలో వారు ఈ సమస్యపై పోరాడాలి.

**రోగమున్న చోటే మందు**

అసలు రోగం నయం కాకుండా పైపైన ఉపశమనాలు ఎన్ని చేసినా అవి తాత్కాలికమే. అందుకే పూర్తిగా రోగం నయం కావాలని ప్రతి ఒక్కరం కోరుకోవాలి. కుటుంబ సమస్యలు పరిశీలించి,అందుకు కారణాలు గుర్తించి, వారికి అవగాహన కల్పించే ప్రయత్నం చేయాలి. వారి సమస్యలకు అసలు కారణాలు తెలియజేయాలి.

ఈ సమస్యల పరిష్కారానికి కొన్ని మార్పులు జరగాలి.

- వివాహం చేసుకోబోయేవారు ముందుగానే ఫ్యామిలీ కౌన్సిలింగ్ తీసుకోవాలి. ఇది ఎందుకంటే -నేటి యువత సామాజిక పరిస్థితుల్ని దృష్టిలో పెట్టుకోకుండా, వ్యక్తిగత జీవితానికే ప్రాధాన్యమిస్తున్నారు. దీనివల్ల చిన్న విషయాలకే విడిపోవాలనుకొనే పరిస్థితులు వస్తున్నాయి. కాబట్టి, పెళ్ళికి ముందే కౌన్సిలింగ్ అవసరం.
- చుట్టుపక్కల ఉన్న కుటుంబాల మధ్య సఖ్యత నెలకొనేలా చేయాలి. నెలకో, రెండునెలలకో ఒకసారి కొన్ని కుటుంబాల్ని ఒక చోట చేర్చి కుటుంబ సంబంధాల గురించి అవగాహన కల్పించాలి.
- కుటుంబ ప్రాధాన్యం చెప్పే మంచి సాహిత్యాన్ని అందించాలి.
- కుటుంబ సమస్యలు పరిష్కరించుకొన్న తమలాంటి వారిని బాగుచేసే సామాజిక బాధ్యతను కూడా చేపట్టాలి. తాము తెలుసుకున్న విషయాన్ని తమలాగా తొందరపడుతున్న వారికి నచ్చజెప్పేందుకు పూనుకోవాలి. "మా జీవితాలు బాగుపడ్డాయి. ఎవరెలా పోతే మాకేంటి'' అని అనుకోకుండా పరిమితంగానైనా కనీసం ఒకరు మరొకరి జీవితానికి తోడ్పడగలిగినా చాలు. ముందు ఇలా ప్రారంభమైతే అదే గొప్ప మార్పుకు దారితీస్తుంది.

ఈ పరిష్కారాలన్నీ తక్షణం ఆచరణలోకి వచ్చి, దీర్ఘకాలం కొనసాగాల్సినవి. ఇందుకు ముఖ్యంగా ప్రభుత్వం మరియు మహిళా సంఘాలు, స్వచ్ఛంద సంస్థలు చొరవ చూపాలి. ఇలా చేస్తే ఎన్నో కుటుంబాల్లో నవ్వులు విరబూస్తాయి.

**(మోటూరు ఉదయం 11వ వర్థంతి సందర్భంగా)**

---

## 20వ పేజీ తరువాయి

తన గ్రంథాలపై వచ్చే రాబడితో వాళ్ళను చదివించారు. వాళ్ళను సరైన శిక్షణ కోసం గాంధీ ఆశ్రమానికి పంపించారు. దేశం నలుమూలలా తిరిగి ఉద్యమ ప్రచారం చేశారు. బాలికా పాఠశాలకు విరాళం ఇచ్చి ప్రోత్సహించారు. తెలుగు, బెంగాలీ, ఆంగ్ల భాషల్లో ఆమె వాక్ప్రవాహం, ఆవేశం ప్రజలకు ఉత్సాహాన్నిచ్చేది.

ఆమె ప్రపంచం స్వాతంత్ర్య సమరం. భర్తకు ఉత్తరాలు రాస్తుండేవారు. పేద రైతుల కోసం మ్యాజిక్ లాంతరు, స్లైడ్లు తెమ్మని భర్త బాపినీడుకు రాసేవారు. భర్తను భారతదేశానికి వచ్చి పేద ప్రజలకు, రైతులకు తోడ్పడమని కోరేవారు. భర్త జాతి, కుల, మత బేధాలను విస్మరించి గొప్ప నాయకునిగా పరిణమించాలని ఆమె ప్రగాఢవాంఛ.

ఆమెకు దేశ సేవయే ముఖ్యం. శక్తివంచన లేకుండా రాత్రింబవళ్ళు సేవచేయటంతో ఆరోగ్యం దెబ్బతింది. కేవలం ప్రకృతి వైద్యంపై ఆధారపడింది. ఆమె ధ్యేయం జాతీయ విద్యాలయం నడపటం, మెహన్‌దాస్ పరిశ్రమాలాయాన్ని అభివృద్ధి పర్చటం, హరిజనోద్ధరణ, దేశ నలుమూలలా తిరుగుతూ ఉపన్యసిస్తూ స్వాతంత్ర్య ప్రచారం చేయడం. పోలీసులు ఆమె జోలికి వచ్చేవారు కాదు.

రాష్ట్రీయ సభ సభ్యురాలిగా, అఖిల భారత జాతీయ ఉపసంఘ సభ్యురాలిగా ఎన్నికైనారు. ఆమెకు 1927 మార్చి 1వ తేదీన పుత్రిక జన్మించింది. ఆమె పేరు ఝాన్సీ లక్ష్మీభాయి. ఆ పసిపాప ఏడో యేటనే గాంధీపై కవిత్వం రాసేది. ఆయనకు ఉత్తరాలు రాసేది. నాలుగు సంవత్సరాలప్పుడే అమ్మమ్మతో కలిసి జైలుకు వెళ్ళింది.

మాగంటి అన్నపూర్ణాదేవి చిన్న వయస్సులోనే అనారోగ్యంతో కనుమూసారు. గాంధీజీ భక్తురాలినేకాదు, పుత్రికను పోగొట్టుకున్నట్లు బాధపడ్డాడు. ఆమెను అత్యుత్తమరాలిగా, దేశసేవికగా భావించాడు. దేశసేవకోసమే జీవితాన్ని త్యాగం చేసిన మహిళ మాగంటి అన్నపూర్ణాదేవి.

మాగంటి అన్నపూర్ణాదేవి స్ఫూర్తి ప్రదాయని. మార్గదర్శకురాలు, త్యాగమూర్తి, గొప్ప ఉపన్యాసకురాలు, భర్తను తన ఉద్యమంవైపు మలచుకున్నది. ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు దేశం కోసమే. ఇటువంటి కార్యదీక్ష, నిర్వహణ చాతుర్యం, త్యాగం ఉండే మహిళలు చాలా అరుదుగా ఉంటారు. ఆ అరుదైన వ్యక్తిత్వం మనకు ముందడుగు వేయటానికి బాట.

స్ఫూర్తి ప్రదాతలు

# ఆదిశక్తికి ప్రతిరూపం లావేటి ఆదెమ్మ

- అల్లూరి మన్మోహినీ



అది 1980వ దశకం. ఏలూరు పట్టణంలో మహిళాఉద్యమం పెద్ద పరీక్షలను ఎదుర్కొంటున్న క్లిష్టదశ. అంతటి క్లిష్ట దశలో ఉద్యమాన్కి తల్లిగా భరోసా నిచ్చి నిలిచారు. అప్పటికే ఆమెకు కాలు దెబ్బతిని నడవలేని స్థితి. ఇంకొకరి భుజంపై చెయ్యివేసుకొని మాత్రమే నడిచేస్థితి. వారి వార్డులో ఎవరూ సంఘంలో చేరరు. అక్కడకు వెళితే సమయం వృధా అని నాకు కొందరు సలహాలు ఇచ్చారు. నాకు బాధకల్గి 'నిజంగా సంఘంలో ఎవరూ చేరరా'? అని ఆదెమ్మగారి వద్దకు వెళ్లి అడిగాను. 'ఎవరమ్మా మీకు చెప్పిన వారు ? ఎందుకు చేరరు?' అని నా భుజంపై చెయ్యి వేసుకొని నడిచి వారి వీధిలోని ఇళ్లకు తీసుకువెళ్లారు. అక్కడ స్త్రీలందరూ ఆమె వచ్చారని ఎంతో సంతోషంతో పలకరించారు. "మీరంతా మీ పేర్లు చెప్పండి. సంఘంలో మీ పేర్లు ఉంటే, మనకు ఏ అవసరం వచ్చినా మన సంఘం మనకు అండగా కొండంత బలంగా ఉంటుంది". అని ఆదెమ్మగారు చెపితే ఎవరూ కాదనలేదు. తామేకాకుండా ఇరుగు పొరుగున ఇళ్లలో ఉన్న వారిని కూడా పిలుచుకొనివచ్చి పేర్లు రాయించి సభ్యత్వ రుసుము రూపాయి చెల్లించారు. అక్కడ 300 సభ్యత్వం చేరింది.

ఆదెమ్మగారు తనకు శక్తి ఉన్నా లేక పోయినా, తను ఎన్ని ఇబ్బందులలో ఉన్నా, ఉన్నంతలో ఎదుటి వారిని ఆదుకునే సంస్కారం ఆమెది. ఆ రకంగా రెండు సం॥లు పాదయాత్రలు చేసిన ఫలితంగా అక్కడ సంఘనిర్మాణం జరిగింది. 1986వ సం॥లో ఏలూరు పట్టణ మహిళా సభ జరిగింది. పట్టణ కమిటీ తొలి అధ్యక్షులుగా ఆదెమ్మగారు ఎన్నికయ్యారు. ఉద్యమంపట్ల ఆమె మమకారం ఉద్యమానికి ఊపిరి అయ్యింది.

ఆదెమ్మగార్కి ఆరుగురు సంతానం. చిన్న పిల్లలతో సంసారం ఈదుతూ సమాజంలో మహిళలపై సాగే నియంతృత్వాన్ని ఎదిరించిన ఆదర్శ వ్యక్తిత్వం ఆమెది. భర్త లావేటి అప్పలస్వామి చుట్టల కార్మికసంఘం నాయకుడు. ఏలూరులో పొగాకు పరిశ్రమలు ఎక్కువ. ఆదెమ్మగారు కూడా అంతమంది పిల్లలను పెంచుకుంటూ, ఇంట్లోనే చుట్టలు చుట్టుకుంటూ శ్రామిక జీవనం సాగించిన బహుముఖ పాత్ర ఆమెది. తన తొలికుమార్తెకు మనరాష్ట్ర మహిళా సంఘం తొలి అధ్యక్షురాలైన కొమర్రాజు అచ్చమాంబగారి పేరు పెట్టుకున్నారు.

డా. అచ్చమాంబగారు "నీవూ, నీపుట్టుక,ప్రసూతి శిశుపోషణ" అనే రెండు పుస్తకాలు వ్రాసారు. ఈ పుస్తకాలు మహిళాకార్యకర్తలు ఊరూరా మహిళల్లో తిరిగి ప్రచారం చెయ్యడానికి బాగా తోడ్పడ్డాయి. వైద్య సౌకర్యాలు లేని ఆ కాలంలో బాలింతలు, పసిబిడ్డల ఆరోగ్యరక్షణకోసం, ఆనాటి మహిళా సంఘనాయకులు ఆరోగ్యసలహాలు, ఇంటింటికి తిరిగి ప్రచారం చేసే కార్యక్రమాలు సాగించేవారు. సాంఘిక, ఆర్థిక, ఆరోగ్య కార్యక్రమాల ప్రచార బలమే మహిళా ఉద్యమాన్కి బలమైన పునాది అయ్యింది.

ఆదెమ్మ ప.గో.జిల్లా దూబచర్ల గ్రామంలో 1920 సం॥లో జన్మించారు. తల్లి దండ్రులు బూరాడ కనకమ్మ, రాందాసుగార్లు. ఆదెమ్మ ఆరోగ్యం క్షీణించి ఏలూరులో ఉన్న కొడుకు, కోడలు తుకారాం, లక్ష్మి గార్ల దగ్గర ఉండగా నేను చూడాలని వెళ్లాను. మంచాన అంటుకుపోయి ఎముకలగూడులా ఉన్నారు. నన్ను చూచి పరమానందపడి, "నన్ను ఆఫీసుకి తీస్కెళ్లండి. అక్కడ మన పెద్దలందరినీ చూడాలి". అని తపించి పోయారు. ఆమెది కంచు కంఠం. స్వరం గంభీరంగానే ఉన్నది. చివరిరోజులలో చిన్నకూతురు దుర్గ దగ్గర ఆమె ఉన్నప్పుడు నాతో ఫోన్‌లో మాట్లాడారు. అదే కడసారి ఆమె స్వరం వినటం.

స్త్రీలపై జరిగే ఘోరాలు, అత్యాచారాలకు సంబంధించి, ఆదెమ్మగారి అమోఘమైన పాత్రకు ఇదే రుజువు. వారి వార్డులో ఉన్న ఒక హరిజన పేటలో మరియమ్మ అనే 20 సం॥ల గర్భిణిపై నలుగురు రౌడీలు దారుణంగా అత్యాచారం చేశారు. రక్తం మడుగులో స్పృహలేని స్థితిలో పడి ఉన్న సమాచారం,విని ఆదెమ్మ ఆ అమ్మాయిని రిక్షాలో తన ఒడిలో పడుకోబెట్టుకుని ప్రభుత్వ హాస్పటల్‌కి తీస్కెళ్ళారు. హాస్పటల్‌లో చేర్చుకోలేదు.

**తరువాయి భాగం 38వ పేజీలో**

# హద్దులు తప్పనిసరి

అశ్లీల చిత్రాలు స్త్రీని కించవరుస్తాయి, దిగజారుస్తాయి, అగౌరవపరుస్తాయి, స్త్రీని ఒక విలన్‌లాగా చిత్రీకరిస్తాయి. అందువలన అశ్లీల చిత్రాల ప్రదర్శన, వాటి అందుబాటు మరింతగా కఠినతరం చేయాలి.

అశ్లీల చిత్రాలపై ఆంక్షలు అమలులోకి రాకుండా జైలులో పెట్టాలని – కమలేష్ వాస్వని కోర్టులో పిల్ వేశారు. ఈ కేసు ఒక్కసారిగా అందరిని మేల్కొలిపింది. ప్రచారసాధనాలు, పత్రికా సంపాదకులు ఉలిక్కిపడినా, అందరూ దీనిని స్వాగతించారు. సాంఘికస్వేచ్ఛ, లైంగికస్వేచ్ఛ వంటి సంబంధిత అంశాలు చర్చకు వచ్చాయి. అశ్లీల చిత్రాలను రద్దు చేసినంత మాత్రాన మహిళలు, పిల్లలపై లైంగిక దాడులు పూర్తిగా ఆగిపోవు అన్నది చర్చించారు. పైపైన చూస్తే రాజకీయంగా ఇది నిజమే అనిపిస్తుంది. కానీ వాస్తవ పరిస్థితులను గమనిస్తే ఈ సమస్య ఎంత జటిలమైనదోగా అర్థమవుతుంది.

**రెండు విషయాల్ని మనం పరిశీలిద్దాం.**

1). ఇద్దరు పురుషులు 5సం॥ల బాలికని లైంగికంగా హింసించినందుకు (రేప్) వారిని ఢిల్లీలో అరెస్టు చేశారు. ఈ రేప్ చేయడానికి ముందువారు అశ్లీల చిత్రాన్ని చూశారు.

2). 2012 సం॥లో గూగుల్ సెర్చ్ చేసిన వారిని లెక్కవేస్తే ప్రపంచం మొత్తం మీద ఒక్క డిల్లీ నగరంలోనే "అశ్లీలం" అన్న పదాన్ని ఎక్కువ సంఖ్యలో సెర్చ్ చేశారు.

జాతీయ నేర పరిశోధక బ్యూరో (ఎన్.సి.ఆర్.బి) లెక్కల ప్రకారం ఒక్క డిల్లీ నగరంలోనే దాదాపు 706 రేప్ కేసులు నమోదు అయ్యాయి. గత 10సం॥కాలంలో పరిశీలిస్తే ఇదే ఎక్కువ సంఖ్యలో రికార్డు అయ్యింది. ఈ సంఖ్య 2002 సం॥లెక్కలకన్నా రెండింతలు ఎక్కువ పెరిగింది.

**పాశ్చాత్య దేశాలలో**

ఇతర దేశాలతో మనదేశాన్ని పోల్చుకోవడం,అనుసంధానం చేయడం చాలా సింపుల్‌గా ఉంటుంది. గాని అంత మాత్రాన దీనిని కాదనే పరిస్థితిలో మనం లేము.

ప్రపంచవ్యాప్తంగా ప్రభుత్వాలు, సోషియాలజిస్టులు ఈ సమస్యపై పోరాటం చేస్తున్నారు. అడ్డు అదుపులేని ఈ అశ్లీల చిత్రాల ప్రదర్శన వలన పిల్లల్ని, స్త్రీలని తిట్టడం, కొట్టడం, లైంగిక దాడులు ఎక్కువగా జరుగుతున్నాయి. ఇది చాలా ఆందోళనకరమైన విషయం.

లండన్‌లో ప్రధాన మంత్రి డేవిడ్ కామెరిన్ ఆధ్వర్యంలో ప్రభుత్వం అశ్లీల ప్రదర్శనలకు సంబంధించి ఒక "కోడ్ ఆఫ్ కాండెక్ట్‌ను" రూపొందించారు. హోటళ్లు, రైల్వే స్టేషన్లు వంటి పబ్లిక్ స్థలాల్లో ఎక్కడైతే పిల్లలు ఎక్కువగా తిరుగుతుంటారో అటువంటి చోట అశ్లీల ప్రదర్శనలు రద్దు చేశారు.

ఐస్‌లాండ్‌లో అశ్లీల చిత్రాల ప్రదర్శనపై ఆంక్షలు విధించినప్పటికి, మన భారతదేశంలో లాగానే ఈ చట్టాన్ని చాలా తక్కువ సార్లు, అదికూడా చాలా అస్పష్టంగా ప్రయోగించుతున్నారు.

ప్రభుత్వం చట్టాన్ని రూపొంది నప్పటికీ ఎంతో కట్టు దిట్టంగా అమలు చేస్తారని, స్వేచ్ఛా ప్రియులకు భయం కలిగించేదిగా ఉన్నట్లు, ఈ చట్టం అమలు కాగానే వెంటనే అశ్లీల చిత్రాల రద్దు చేయడం తద్వారా పసిపిల్లలు అశ్లీల చిత్రాలనుంచి, వేధింపుల నుంచి కాపాడబడతారని మనకు పైకి కనిపిస్తుంది. గానీ గార్డియన్ పత్రికా విలేకరి వ్యాఖ్యానం ప్రకారం : ఐస్‌లాండ్ అంతర్గత వ్యవహారాల మంత్రి స్వయంగా అన్న మాటలు ప్రకారం "ఒక 12సం॥ల వయస్సుగల అబ్బాయి లేక అమ్మాయి గూగుల్ సెర్చ్‌లో" "అశ్లీలం" అన్న పదాన్ని సెర్చ్ చేస్తే వారికి నగ్నంగా వున్న స్త్రీ బొమ్మలు కనపడవు కానీ, అంతకన్నా భాధాకరమైన, క్రూరంగా అత్యాచారం చేస్తున్న చిత్రాలు వారికి కనిపిస్తున్నాయి; అవి ఆ పిల్లలు చూస్తున్నారు.

అశ్లీల చిత్రాల వలన వచ్చే ప్రధాన సమస్యే ఇది. ఇది ఒక్క సెక్స్ గురించి చూపించడమే కాదు, ఇందులో విపరీత ధోరణులు, అత్యాచారాలు, లైంగిక హింసలు, స్త్రీలని తక్కువ చేసి చూపించడం, మహిళలని అణగదొక్కడం, పిల్లల్ని, యువతుల్ని హింసించడం, తిట్టడం,కొట్టడం చూపిస్తున్నారు. ఇది రేప్ కన్నా ఎక్కువ. ఆ వ్యక్తిని భయపెట్టడం, లొంగదీసుకోవడం, తరువాత ఆ స్త్రీని ఎందుకూ పనికి రాని వ్యక్తిగా చేస్తున్నారు.

మరింత భయంకరమైన విషయమేమంటే, ఆ స్త్రీని లైంగికంగా హింసించడం ఒక సామాన్యమైన విషయంగా పరిగణించడం. భారతదేశం లాంటి దేశాలలో ఇదంతా ఒక రోటీన్ చర్యగా జరుగుతున్నది. ఎక్కువ సంఖ్యలో ప్రజలు ముఖ్యంగా ఇటువంటి విషయాలలో అమాయకపు స్త్రీలే బలౌతున్నారు. వీరికి సెక్స్ పరిజ్ఞానం, కనీస సెక్స్ అవగాహనయే లేని ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. అందువలననే వారు విషవలయంలో చిక్కుకుంటున్నారు.

### లైంగిక దాడులని స్టేట్‌మెంట్లుగా ప్రదర్శించడం

అశ్లీల చిత్రాల ప్రదర్శన రోజురోజుకీ విపరీత ధోరణులతో ముందుకు దూసుకువస్తున్నది. దీని కనుగుణంగానే ఒక వైపు గ్యాంగ్ రేప్‌ల సంఖ్యా పెరుగుతున్నది. రెండవవైపు ఈ లైంగిక దాడిచేస్తే వ్యక్తుల వయస్సు కూడా క్రమంగా తగ్గుతున్నది. లైంగిక దాడుల రూపాలు చాలా క్రూరంగా మారుతున్నాయని సోషియాలజిస్టులు గమనించారు.

అమెరికా న్యాయశాఖ లెక్కల ప్రకారం 1994-98 సం॥తో పోలిస్తే 2005-2010 సం॥లో ఇద్దరు కన్నా ఎక్కువ మంది కలిసి అత్యాచారం చేయడానికి పాల్గొన్న వారి సంఖ్య 7% పెరిగింది.

గత సం॥అమెరికాలో ఒహియో ప్రాంతంలో స్టూబెన్ విల్లా హైస్కూలులో ఒక విద్యార్థినికి మత్తుమందు ఇచ్చి అనేకసార్లు అదే స్కూలు విద్యార్థులు ఆమెపై అత్యాచారం చేసారు. ఈ సందర్భంగా రెండు విపరీత ధోరణులు గమనించారు. మొదటిది: ఈ అత్యాచార చర్యలని ఒక విద్యార్థి ఫోటోలను తీసి సోషల్ మీడియాలో ప్రదర్శించాడు. ఇది దేశమంతా మహమ్మారిలా క్షణాలలో వ్యాపించింది. రెండవది: ఈ అత్యాచారం జరుగుతున్న దృశ్యాన్ని చూసిన ఇతర విద్యార్థులు జరుగుతున్నది అత్యాచారం అన్నట్లుగా దానిని గుర్తించకపోవడం ఆశ్చర్యకరం.

గత కొన్ని నెలల క్రితం అమెరికా మరియు కెనడా దేశాలలో "రిహతేష్ పార్సన్ మరియు ఆడ్రి పాట్" అనే ఇద్దరు యువతులు ఆత్మహత్య చేసుకున్నారు. కారణం 16-17 సం॥ల రివార్డులో వారిపై గ్యాంగ్ రేప్ చేయడమే కాకుండా ఆ ఫోటోలను ఆన్‌లైన్‌లో ప్రదర్శించారు. మనదేశంలో కూడ అనేక ఘటనల్లో స్కూలు పిల్లలు కూడా పాల్పడ్డారని మనం మర్చిపోరాదు.

**గజిబిజీగీతలు : Blurring Lines**

ఆన్‌లైన్‌లో అశ్లీల చిత్రాల ప్రదర్శన కొన్ని సందర్భాలలో నిజ జీవితంలో అమ్మాయి ఫోటోలని వారికి తెలియకుండా రహస్య కెమేరాల ద్వారా తీస్తున్నారు. ఇంకొక మాటలో చెప్పాలంటే అశ్లీల చిత్రాల ఫోటోలతో ఈ ఫోటోలని జత చేస్తున్నారు. అశ్లీల వెబ్‌సైట్లను, సాంఘిక వెబ్ సైట్లను సమ్మిళితం చేస్తున్నారు. ఇంతవరకు "క్లాస్ డిస్టన్" వెబ్‌సైట్‌లో వున్న ఫోటోలను, క్లాస్‌మేట్ ఫేస్‌బుక్‌లో వున్న ఫోటోలను కలిపేస్తున్నారు.

అశ్లీల చిత్రాల వలనే అత్యాచారాలు జరిగాయి అని మనం లెక్కల ప్రకారంగా తేల్చి చెప్పడం కష్టమే కానీ ఈ అశ్లీల చిత్రాల ప్రదర్శన స్త్రీలు, పిల్లలపై బూతులు తిట్టడాన్ని ప్రోత్సహిస్తున్నది. ఈ మధ్యనే వార్తలలో కౌన్సిలింగ్ చేసేవారి రిపోర్టు ప్రకారం ఈ అశ్లీల చిత్రాలు వీక్షణ అనేక వివాహ సంబంధాలు, విడాకులకు కారణం అవుతున్నాయి. మహిళలపై లైంగిక దాడులు కూడా పెరిగాయి. సినిమాలలో స్త్రీలపై దాడులు- సమాజంలో మహిళలపై దాడులు పెరగటానికి కారణం అవుతున్నది. ఏదో ఒక రకంగా సెన్సార్ సర్టిఫికెట్ తెచ్చుకుని అశ్లీల చిత్రాల ప్రదర్శన చేస్తున్నారు. ఈ అశ్లీల చిత్రాల ప్రదర్శన మరింతగా మహిళలపై లైంగిక దాడులకు అవకాశం కల్పిస్తున్నది. దీనిని రెగ్యులేట్ చేయకుండా, నియంత్రించకుండా అధికారులు ఎందుకు వారిస్తున్నారో? ప్రస్తుతం వున్న టి.వి. చట్టం ప్రకారం అశ్లీల చిత్రాలు తీసినా, ప్రదర్శించినా వారికి 3సం॥జైలు శిక్ష విధించాలి. అనేక మంది ఈ శిక్షనుండి తప్పించుకుంటున్నారు.

వాన్‌వ్వని పిల్ వేయడం వల్ల సుప్రీంకోర్టు, సమాచార మరియు టెక్నాలజీ మంత్రికి, ఇన్ఫర్మేషన్ అండ్ బ్రాడ్ కాస్టింగ్‌కు మరియు హోమ్‌శాఖ మంత్రికి ఈ విషయం మీద ఏప్రిల్ 29 లోపు సమాధానాన్ని ఇవ్వవలసిందిగా ఆదేశించింది.

కేవలం అశ్లీల చిత్రాల ప్రదర్శన తిలకించేవారిని "నీ వయస్సు 18సం॥దాటిందా" అన్న ఒక్క ప్రశ్న మాత్రమే సరిపోదు. మరింతగా కఠినమైన విధానాలు, శిక్షలు, జరిమానాలు, సాంకేతిక పిల్లర్స్ అశ్లీల చిత్రాల్ని నిరోధిస్తాయి.

స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు చాలా విలువైనవే. వాటి గురించి పోరాటం చేయడం గొప్ప విషయమే. గానీ కొంత మంది పురుషులు ఈ స్వేచ్ఛని వక్రంగా ఉపయోగిస్తున్నారు. దుర్వినియోగం చేస్తున్నారు. దీనివలన స్త్రీలు, పిల్లలు బలి అవుతున్నారు. కొద్దిమంది పురుషుల స్వేచ్ఛకి అనేక మంది స్త్రీలు, పిల్లలు ఎందుకు బలి కావాలి ?

**(హిందు సౌజన్యంతో..)**

**(అనువాదం : ఎం.పద్మజ)**

**36వ పేజీ తరువాయి**

హాస్పటల్ ఆవరణలోనే క్వార్టర్స్‌లో ఉన్న సూపరెండెంట్ ఇంటికి వెళ్లి తలుపు కొట్టి గట్టిగా పిలిచాం. రాత్రి 10.30గం॥ల సమయం. ఆయన కోపంతో తలుపుతీసి "ఏమిటి గొడవ" అంటే రిక్షాలో ఉన్న ఆదెమ్మ హాస్పటల్‌లో "ప్రమాదంలో ఉన్న వాళ్లకు వైద్యంలేదా ? తన ఒడిలో ఉన్న అమ్మాయిని చూపించి" ఈ అమ్మాయిని చేర్చుకోలేరా అని తీవ్రంగా అన్నారు. సూపరెండెంట్‌గారు స్పందించి, "ఎవరమ్మా చేర్చుకోనిది," రండి ముక్కు పిండి జాయినింగ్ చేయిస్తాను" అన్నారు. ఆయన మాకూడానే నడిచి హాస్పటల్‌లోకి వచ్చి మరియమ్మను చేర్చుకుని వైద్యసహాయం అందించారు. గర్భ స్రావం మాత్రం జరిగింది.

ఆ రకంగా ఆదెమ్మ కష్టంలో ఉన్న వాళ్లను ఆదుకోవటంలో కొండంత శక్తిగా పనిచేసింది ఆమె వ్యక్తిత్వం. ఉద్యమానికి ఎంతో భరోసానిచ్చింది. 92సం॥ల వయసులో ఏలూరులోనే కుమారుడు తుకారాం దగ్గరే కన్నుమూసారు. ఆమె జీవనయానం మహిళా ఉద్యమానికి ఎన్నో పాఠాలు నేర్పింది. ఆ మహాతల్లికి ప్రజాతంత్ర మహిళా ఉద్యమం నివాళులు అర్పిస్తోంది.

కథ

# మహిళ-మనిషి-మృగము

-ఆవుల రామచంద్రయ్య.

"ఇదో లచ్చుమ్మవ్వా! ఆ పిల్లదాన్ని కొంచెం చూస్తావుండు-ఆ మామిడి తోపులోకెల్లి నాలుగు గడ్డి పరకలు కోసుకొనొస్తా! పొద్దున్నుంచీ ఆ ఎనుముకి తిండిలేదు. బిరానొస్తా"! అంటూ కేకేసి సుబ్బలక్ష్మి గబగబా బయటికి పరుగెత్తింది.

''పొద్దుగూట్లో పడుతాంది. ఈయాలప్పుడు యాడికే నువ్వు పొయ్యేది!-అసలే ఒట్టి మనిషివి కూడా కాదు-ఇప్పుడో, అప్పుడో కనేటట్లున్నావు!" అంటూ అరిచింది అవ్వ.

అవ్వ మాటలు వినిపించుకోకుండా వెళ్లిపోయింది సుబ్బలక్ష్మి. పట్టుమని రెండు పదుల వయసన్నా ఉండదు. చిన్నప్పుడే మొగుడు తాగొచ్చి పెట్టే బాధలు పడలేక, ఊరవతల రెడ్డోరి బావిలో పడి చచ్చిపోయింది అమ్మ. మూడేళ్ళ కూతుర్ని వదిలేసి యెక్కడికో వెళ్ళిపోయాడు తండ్రి. పెద్దమ్మ ఆ బిడ్డను చేరదీసి, పెద్దమనిషి అవగానె, చుట్టాల్లో ఉన్న ఒక జులాయి వెధవకిచ్చి పెళ్ళి చేసి వదిలించుకుంది. అప్పటి సుబ్బలక్ష్మికి పట్టుమని పదమూడేళ్ళయినాలేవు. అంతవరకూ ఆడుతూ యెగురుతు ఉన్న ఆడపిల్లలకు పెళ్ళవగానె ఎక్కడలేని పెద్దరికమూ వస్తుంది. బాధ్యతలు నెత్తినపడతాయి.

మొగుడు బాధ్యతలు లేని మనిషని తెలుసుకుంది. రోజూ ప్రొద్దున్నే లేచి చద్దినీళ్లు తాగి, నారుమళ్ళలో కూలికెళ్ళేది. కూలి డబ్బులతో మొగుడికి తిండి పెట్టేది. వాడు తిని ఉన్న డబ్బులు గుంజుకుని బయటికెళ్ళిపోయేవాడు.

మూడేళ్ళు గతించిపోయినాయి. ఊరవతల గవర్నమెంటు స్థలాల్లో అందరూ ఇండ్లు వేసుకుంటూవుంటే సుబ్బలక్ష్మి కూడా వెళ్ళి ఒక పాక వేసుకుంది. లక్ష్మవ్వ పాక పక్కనే.

ఒక పాప పుట్టి మూడేళ్ళయింది. నాలుగు కోళ్ళు, ఒక యెనుము ఉన్నాయి. మొగుడు మారలేదు. ఇల్లు వదిలిపోతే యెక్కడున్నాడో తెలియదు. ఎప్పుడొస్తాడో తెలియదు-సుబ్బలక్ష్మి మాత్రం ఇయేవీ పట్టించుకోకుండా యంత్రంలా రోజులు గడుపుకొస్తోంది.

ఇప్పుడు గడ్డి కోసమై తోపులో వంగి గడ్డి పరకలు గబగబా కోయటం మొదలెట్టింది. ఒక్కసారిగా నొప్పులు ప్రారంభమయ్యాయి. అబ్బా! అంటూ అట్లే క్రింద నడుము వాల్చి చేతులు వెనక్కి ఆన్చి కూచుండిపోయింది. చుట్టుపక్కల యెవరు కనపడలేదు పిలవడానికి. నొప్పి తీవ్రంగా వచ్చి 'అమ్మా!' అంటూ పడుకుండిపోయింది నేలమీద. ఆ గట్టినొప్పికి బిడ్డ బయటికి వచ్చేసింది.

కాసేపు సోషవచ్చి కళ్ళుమూసుకుని పడుకుంది.

కాసేపటికి తెలివి తెచ్చుకుని పక్కకు వంగి చూసుకుంది మగబిడ్డ. మాతృత్వం పెల్లుబికింది. లేని శక్తి కూడగట్టుకుని గడ్డికోసిన కొడవలితో మాయం వేరుచేసుకుంది. బిడ్డను తీసుకుని గుండెలకు హత్తుకుంది. రక్తంతో తడిసిపోయిన చీర పేలికనే బిడ్డకు కప్పి పట్టుకుంది. కొడవలితో పక్కనే చిన్న గుంత తవ్వి మాయను పూడ్చిపెట్టి మట్టి కప్పింది.

అప్పుడే ప్రొద్దుగూకుతోంది. లేని శక్తి కూడగట్టుకుని బిడ్డని ఎడమ చేత్తో హత్తుకుని, కోసిన గడ్డి మూటను కుడిచేత్తో లాక్కుంటూ ఇంటికి బయలుదేరింది అడుగులో అడుగేసుకుంటూ!

ఇంటి దగ్గర లక్ష్మవ్వ ఆతురతతో చూడసాగింది-సుబ్బలక్షి కోసం. అల్లంత దూరాన మెల్లగా [illegible]తూ వస్తున్న సుబ్బలక్ష్మిని చూసి చేతిలో కట్టెతో ఊతచేసుకుంటూ గబగబ ఎదురేగింది.

"ఓసి పాడుపిల్ల ఎంతపని చేసినావే! చెప్పిన మాటింటివా-నీ బిడ్డనోట్లో మట్టికొట్టిపోదామనుకున్నావ్!" అంటూ సుబ్బలక్ష్మి చేయి పట్టుకుని గడ్డిమోపు తీసుకుని మెల్లగా ఇంటికి తీసుకొచ్చింది.

ఇంటికి రాగానే గడ్డిమోపును యెనుముకేసింది అవ్వ! ఆకలితో వున్న యెనుము ఆవురావురుమంటూ తినడం మొదలెట్టింది.

సుబ్బలక్ష్మిని నులక మంచంపైన పడుకోబెట్టి ఇంట్లో ఒక పాత చీరతెచ్చి, తడిసినవి తీసి, చుట్టబెట్టింది. లోపలికెళ్ళి రాగిసంకటి, చెనిగ్గింజల ఊరపిండి తెచ్చి తినిపించింది అవ్వ.

అది తిని కాస్త కళ్ళుమూసింది సుబ్బలక్ష్మి. తుఫాను మాదిరి వచ్చి పడ్డాడు మొగుడు తూలుతూ! ''యేయ్! యాడనచ్చినావే సుబ్బీ! వీడెవ్వడే యాన్నుంచి తెచ్చినావ్! పోరెయ్" అంటూ పసిబిడ్డను లాక్కోబోయాడు. "లెక్కుంటే ఇయ్ కావాల! ఆకలవుతాంది. బయట కోడికూర తినాల" అంటూ గూట్లో వున్న నాలుగు రూకలు తీసుకుని వెళ్ళిపోయాడు తూలుతూ.

"తూ! పాడుముండాకొడుకు! నీ ఖర్మ కొద్దీ దొరికాడే ఈ మొగుడు! ఏ రాతరాసినాడే ఆ బగమంతుడు నీ మొఖానా! యెపుడూ కట్టాలేనా?" అంటూ తలబాదుకుంది అవ్వ, సుబ్బలక్ష్మిని సంబోదిస్తూ.

"పోనీలే అవ్వా! వాడితో యేంది? నా బతుకు నాది! దేవుడిట్టా రాసినాడు యేంచేయాలా?'' పుట్టిన బిడ్డను చూసుకుంటూ తనకు తానే ఓదార్చుకుంది సుబ్బలక్ష్మి. తల్లిని, బిడ్డను చూసి తవ్వెడు పాలు ఎక్కువగా ఇచ్చింది యెనుము!

**(చైతన్య మానవి దశాబ్ది ప్రత్యేక సంచిక విడుదల సందర్భంగా నిర్వహించిన కథల పోటీలో సాధారణ ప్రచురణకు ఎంపికైన కథ)**

# స్పందన

జనవరి-మార్చి మానవి ఎడిషన్‌లో సరోజిని నాయుడు జీవిత చరిత్ర తెలపడం జరిగింది. నైటింగేల్ అనే బిరుదు ఎలా వచ్చింది అనేది కూడా వివరిస్తే ఇంకా బాగుండేది.

**బి. శారద**
**సనత్‌నగర్, హైదరాబాదు**

**'చైతన్యమానవి'**
**సంపాదకులు**

మీరు పంపిన 'చైతన్యమానవి' జనవరి-మార్చి 2013 సంచిక అందింది. రెండు కాపీలు పంపించినందుకు కృతజ్ఞతలు, ఇక్కడ కొందరు మహిళలచేత చదివిస్తున్నాను. నాకథ 'మరోదారి' నా సంకలనం నుంచి తీసుకుని ప్రచురించినందుకు సంతోషం. మీకు నచ్చినందుకు మరింత సంతోషంగా ఉంది. ఈ సంచికలో ప్రచురించిన 'పోటీ' అనే కథలో పోటీ తత్వాన్ని విమర్శించడం, పిల్లల్ని పోటీలకు గురి చెయ్యకుండా పెంచడం గురించి రాయడం నచ్చింది, కానీ రచయిత్రి స్వయంగా పోటీకి కథ పంపించడం ఆశ్చర్యం కలిగించింది. అందుకే మీరు 'సాధారణప్రచురణ' అనడం సముచితంగా ఉంది.

'చైతన్యమానవి' మహిళలను చైతన్య పరచడంలోనూ,మీ ఉద్యమాన్ని బలపరచడంలోనూ మీరు విజయవంతం కావాలని ఆశిస్తూ, పత్రిక కోసం 1000/- రూ.లను నావంతు చేయూతగా చెక్కు పంపిస్తున్నాను. స్వీకరించండి.

ఉగాది అభినందనలతో, శుభాకాంక్షలతో,

**- అబ్బూరి ఛాయాదేవి, రచయిత్రి**

**ఎడిటర్‌గారికి,**
**చైతన్యమానవి,**

చైతన్యమానవి పత్రిక రెగ్యులర్‌గా అందుతూ ఉంది. ఆర్టికల్స్ బాగున్నవి. కాని ఈ సారి, మహిళలపై పెరుగుతున్న హింసపై చాలా వ్యాసాలు వచ్చాయి. మ్యాటర్ కూడ దాదాపుగా ఒకటిగానే వుంది. పత్రికలో ఎక్కువ పేజీలు దానికే కేటాయించబడ్డవి. త్రైమాసిక పత్రిక కాబట్టి అన్ని అంశాలు కవర్ అయితే బావుంటుందనిపించింది.

**- రాజ్యలక్ష్మి**
**ప్రగతీనగర్, రంగారెడ్డి**

---

## హైకూలు

విద్య ప్రయివేటు 'ఎర' అయ్యింది
బిడ్డ మీద ప్రేమతో అమ్మా నాన్నలు
అలుపెరుగని జాలర్లవుతున్నారు
ప్రభుత్వరంగం చేష్టలుడిగి చూస్తుంది

రంగు వెలసిన పాఠశాలల్లో
అర్హతలున్న ఉపాధ్యాయులు
రంగురంగుల మేడల్లో ఉన్న బడుల్లో...?
కార్పోరేట్ కల్చర్ మత్తు మందులా
ఆవహిస్తోంది.

**- సుధాకిరణ్.బి.**

## పల్లె గుండెల్లో గుబులు

రాష్ట్ర రాజధానిలో...
ఏ చిన్న సంఘటన జరిగినా
ఆంధ్రప్రదేశంలోని
ప్రతిపల్లె గుండె కొట్టుకుంటుంది.
పనికోసమో, పై చదువుల కోసమో
బతుకు దెరువుకోసమో...
వెళ్ళిన ప్రజలు
పదిలంగా నిర్మించుకున్న
వలసపక్షుల గూడు హైదరాబాద్
అందుకే...
అక్కడ ఏ అల్లర్లు, ఘటనలు
జరుగకూడదని
ఆకాంక్షిస్తారు సమైక్యంగా

**- సుధాకిరణ్.బి.**

**చట్టాలు**

# హిందూ వితంతు పునర్వివాహ చట్టం 1856

-ఆర్. దుర్గా ప్రసన్న, అడ్వకేట్

వివాహం అనేది స్త్రీ పురుషుల గృహస్థ జీవితంలో అతి ముఖ్యమైన అంశం. ఏ దేశంలో అయినా ఏ సమాజంలో అయినా వివాహం, సంతానం, కుటుంబం, మనిషి జీవితంలో ప్రాముఖ్యతను సంతరించుకునే అంశాలు. "వివాహం జూదం లాంటిది. గెలుపు, ఓటములు వివాహానంతరం భాగస్వాముల అదృష్టాన్ని అనుసరించి దక్కుతాయి'' అని ప్రపంచవ్యాప్తమైన నానుడి. పూర్వ కాలం నుండీ మన దేశంలో వివాహం విషయంలో పురుషుడికి అనేక వెసులుబాట్లు కల్పించగా మన సమాజం స్త్రీకి క్రుంగుబాట్లు మిగిల్చింది అనవచ్చును. స్త్రీ పురుషులు వివాహానంతరం వారి వైవాహిక జీవితం కలసిమెలసి సాగించే ప్రయాణం అయితే అనుకోని పరిస్థితులలో భాగస్వామి మరణించినపుడు నాటి సంఘం, సమాజం పురుషునికి మళ్ళీ పెళ్ళి చేసుకునే వెసులుబాటు కల్పించింది. స్త్రీ విషయంలో జీవితంలో ఒకే ఒక్కసారి జరిగేది వివాహం అంటూ తేల్చి చెప్పింది. స్త్రీలు తమ భర్తలను ఎన్నుకునే పరిస్థితే లేదు అని చెప్పవచ్చు. ఎందుకంటే దాదాపు ఆనాటి పెళ్ళిళ్ళన్నీ బాల్య వివాహాలే. తల్లిదండ్రులు ఇంట పెళ్ళి కాని ఆడపిల్ల పుష్పవతి అయిందంటే అది ఆ ఇంటికి అరిష్టంగా, ఆ కుటుంబానికి తలవంపుగా భావించే పరిస్థితులు. ఆడపిల్ల పుట్టినపుడు పరాయి ఇంటికి పంపే ప్రయత్నం పెళ్లి పేరుతో ఏదోఒక సంబంధం చూసి లేదా ఈడుజోడూ సరిపోక పోయినా ఎవరోఒకరితో ముడివేసి చేతులు దులుపుకునే పరిస్థితి. బహుభార్యాత్వం సర్వ సాధారణమైన నాటి సమాజంలో పెళ్ళి ఖర్చులు, కన్యా శుల్కం, వరకట్నం లాంటి దురాచారాలు స్త్రీ యొక్క స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు ప్రతిబంధకాలుగా నిలిచాయి. ఇక స్త్రీ విద్య, స్త్రీకి ఆస్తి హక్కుల గూర్చిన స్థితిగతులే లేవు.

వివాహం అంటే పురుషులు పురుషార్థాల్ని సాధించుకోవడానికి, గృహస్థాశ్రమాన్ని స్వీకరించడం. వివాహాన్ని మనసు, శరీరాలకు పతివ్రతలను చేకూర్చే పవిత్రమైన కార్యంగా భావించేవారు. అందుకు కన్యను దానం చేసి తల్లిదండ్రులు వివాహ క్రతువును నిర్వహిస్తారు. అందువల్ల జీవితంలో ఒకేసారి జరిగేది వివాహం. సర్దుబాట్లతో సంసారం సాగాల్సిందే. అనుకోని పరిస్థితులలో భార్య మరణిస్తే పురుషుడు మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చును. కానీ భర్త మరణించినపుడు భార్యకి ఆ హక్కు లేదు. భర్త మరణించిన భార్య వితంతువు అవుతుంది. ఆమె ఏవిధమైన మతపరమైన క్రతువులను నిర్వహించరాదు. ఏ శుభకార్యాలకూ హాజరు కారాదు. ఉప్పు, కారం, పులుపు లేనీ ఏకభుక్తం, భూశయనం, చన్నీటి స్నానం లాంటి అనేక నియమాలు పాటించాలి. శిరోముండనం చేయించుకొని ఆకర్షణీయం కాని తెల్లని వస్త్రాన్ని మాత్రమే ధరించాలి. స్త్రీలకు అత్యంత ఇష్టమైన పూలు, నగలూ లాంటివి ధరించ కూడదు. పుట్టినింట్లోగాని మెట్టినింట్లోగాని బంధువుల దయా ధర్మాల మీద వారికి అవసరమైన సేవలు చేస్తూ జీవితం వెళ్ళదీయాలి. అంటే పెళ్ళి అంటే తెలియని వయస్సులో జరిగిన పెళ్ళికి, భర్త ఎవరో కూడా గుర్తు తెలియని స్థితిలో ఉన్న బాలికలు ఆ భర్త చనిపోయినపుడు జీవితాంతం వైధవ్యంతో, నిర్బంధంలో నిస్సహాయంగా, నిర్వేదంగా జీవితమంతా గడపవలసిన దుస్థితిలో ఉండేవారు. ఇంటి పని, వంట పని మాత్రమే చేస్తూ వంటింట్లో మగ్గిపోయేవారు. కొన్ని సందర్భాలలో దగ్గరి బంధువులైన పురుషుని లైంగిక దాడికి బలి అయి ఆత్మహత్యలకు పాల్పడుతూ ఆత్మ విశ్వాసం, ఆర్థిక స్వేచ్ఛ లేకుండా దుర్భరమైన జీవితం గడిపేవారు.

ఆనాటి సమాజంలో ఇంటింటా బాల వితంతువులే. కాపురానికి వెళ్ళకముందే వారి భర్తలు మరణించడం సర్వ సాధారణం. అలా వితంతువులుగా వారు మిగిలిపోవడం వారి యొక్క పాపంగానూ, శాపంగానూ భావించేవారు. ఈ పరిస్థితి ముఖ్యంగా అగ్రవర్ణాలలో చాలా ఎక్కువగా ఉండేది. పరిస్థితికి ఎదురు తిరగాలనే ఆలోచనే అప్పటి సమాజంలో వుండేదికాదు.

ఇటువంటి దుర్భర స్థితిలో స్త్రీలు, సమాజం మగ్గిపోతున్నపుడు మహిళల జీవనగతిని తద్వారా సమాజ స్థితిని మెరుగుపరచడానికి అలుపెరుగని ఉద్యమాన్ని నడిపిన వ్యక్తి ఈశ్వరచంద్ర విద్యాసాగర్. సంస్కృత పండితుడు, ఉపాధ్యాయుడు అయిన ఈయన

శాస్త్రములను చదివి వాటి అర్థాలను సామాన్యులకు విశదపరచాడు. అంతేకాదు నాటి కాలంలో అణగద్రొక్కబడిన మహిళల స్థితిని హిందూ ధర్మ శాస్త్రములు సమ్మతించవంటూ మహిళల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, విద్యా, వారసత్వ ఆస్తులను వారికి చెందకుండా చేసే పురుషుల అధికార ఆర్భాటాలు, మూర్ఖత్వమే దీనికి కారణమని వివరించాడు.

ఈశ్వరచంద్ర విద్యాసాగర్ తదితరుల కృషి వల్ల, సమాజంలోని అసమానతలను తొలగించడానికి నాటి ప్రభుత్వం (ఈస్ట్ ఇండియా కంపెనీ) 1856లో వితంతు పునర్వివాహ చట్టంను చేసి దాని ద్వారా భర్త మరణించిన స్త్రీలు తిరిగి చట్టబద్ధంగా వివాహం చేసుకోవడానికి, భర్త యొక్క వారసత్వపు ఆస్తిలో వాటా పొందడానికి అవకాశం కల్పించారు. 1856, జులై25 నుండీ ఈ చట్టం అమలులోకి వచ్చింది. సమాజంలో స్త్రీలు వివాహం పేరిట, కట్టుబాట్ల పేరిట ఎదుర్కొనే వివక్షని రూపుమాపి స్త్రీలకు పురుషులతో సమాన న్యాయం అందించడానికి ఈ చట్టం దోహదపడింది. అనేక వితంతు పునర్వివాహాలకు ఈ చట్టం భద్రత కలిగించింది. ఆంధ్ర దేశంలో కంకుకూరి వీరేశలింగం పంతులు గారు తదితర సంఘ సంస్కర్తలు, రచయితలు వితంతు పునర్వివాహాలను ప్రోత్సహించి సమాజంలో చైతన్యం కలిగించారు.

సమాజ శ్రేయస్సు, ప్రజల పురోభివృద్ధి ప్రాతిపదికన చేసిన ఈ చట్టంలో 10 సెక్షన్‌లు ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి.

1. వితంతువు యొక్క పునర్వివాహానికి చట్టబద్ధత కల్పించబడింది. భర్త మరణించిన భార్యలు పునర్వివాహానికి అర్హులు.
2. వితంతువులు మనోవర్తిని గానీ, వారసత్వ ఆస్తిలో భాగాన్ని గానీ (అనుభవపు హక్కులు మాత్రమే) భర్తయొక్క ఆస్తినుండీ పొందవచ్చును. అయితే 2వ వివాహము చేసుకున్న పక్షంలో ఈ హక్కులు రద్దుచేయబడతాయి.
3. వితంతువులకు మరణించిన భర్త యొక్క పిల్లల సంరక్షణా భాధ్యత చట్టబద్ధత కల్పించబడింది. అంటే పిల్లల చదువు సంధ్యలు, సంరక్షణ భాధ్యతపై తల్లికి అధికారం ఇవ్వబడింది.
4. పిల్లలు లేని కారణంగా ఆమెకు భర్త యొక్క వారసత్వపు ఆస్తిలో అనుభవ హక్కులు ఉండేవి కాదు. కానీ ఈ చట్టం ద్వారా పిల్లలు ఉన్నా లేకున్నా వితంతువు వారసత్వపు ఆస్తిలో మనోవర్తి కోరే హక్కు కల్పించబడింది.
5. వివాహ క్రతువును నిర్వహించి వితంతు వివాహం జరిపించ వచ్చును. ఎవరూ ఆక్షేపించరాదు. వితంతువును గానీ, ఆమె పునర్వివాహాన్ని గానీ ఎవరూ ఆక్షేపించరాదు.
6. వితంతువు మైనర్ అయినప్పుడు మళ్ళీ పెళ్ళి చేసుకోవడానికి ఆమె తండ్రి గానీ, తండ్రి లేనిపక్షంలో తాతగానీ, తాత జీవించి లేనపుడు తల్లిగానీ, తల్లి కూడా లేనపుడు అన్న గానీ లేదా ఎవరేని పురుష బంధువు యొక్క అనుమతి తప్పనిసరి.
7. వితంతువు మేజర్ అయినపుడు పునర్వివాహానికి ఆమె యొక్క అనుమతి సరిపోతుంది.
8. అంతేకాదు ఈ చట్టాన్ని అతిక్రమించినా, అమలు చేయకుండా అడ్డుకున్నా వారికి జైలుశిక్ష, అపరాధ పరిహారం వేసే అధికారం సివిల్ న్యాయస్థానాలకు ఉంటుంది. ఒకోసారి జైలుశిక్ష, అపరాధ పరిహారం కూడా న్యాయస్థానం విధించవచ్చును.

ఏమైనప్పటికీ సమాజంలో స్త్రీల యొక్క స్థితిగతులు మెరుగుపడడానికి, తద్వారా కుటుంబ జీవనం ఆర్థిక, సామాజిక పరిపుష్టిని సాధించడానికీ ఈ చట్టం ముఖ్య పాత్రను పోషించింది అనడంలో సందేహం లేదు. నేటి స్త్రీ విద్యా, ఆస్థి హక్కుల ఆవశ్యకతను గుర్తించడం ఆనాడే జరిగింది.

అవునా..... ?

## బంగారు తల్లి

**పథకం ఇలా....**

ఆడపిల్ల పుట్టగానే 2,500, 1-2 సంవత్సరాల్లో ఏడాదికి వెయ్యి, 3-5 సంవత్సరాల్లో ఏడాదికి 1,500, 6-10 సంత్సరాల్లో ఒకటి నుంచి ఐదో తరగతి వరకు ఏడాదికి 2,000, 11-13 సంవత్సరాల్లో 6-8వ తరగతి వరకు ఏడాదికి 2,500 14-15 సంవత్సరాల్లో 9,10 తరగతుల్లో ఏడాదికి 3,000, 16-17 సంవత్సరాల్లో ఇంటర్‌లో ఏడాదికి 3,500, 18-21 సంవత్సరాల్లో గ్రాడ్యుయేషన్ ఏడాదికి 4,000, 18వ ఏట ఇంటర్ పాసైతే రూ.50 వేలు లేదా, డిగ్రీ పూర్తయ్యాక లక్ష ఇప్పటికే వివిధ పథకాల కింద అందిస్తున్న లబ్ధికి 'బంగారుతల్లి' ప్రోత్సాహకాలు అదనం.

**ప్రస్తుతమున్న పథకాలు..**

జననీ సురక్ష యోజన, సుఖీభవ పథకాల కింద బిడ్డ పుట్టగానే వెయ్యి రూపాయిలు ;-8వ తరగతి వరకు ప్రీ మెట్రిక్ స్కాలర్‌షిప్ కింద ఏడాదికి వెయ్యి రూపాయిలు; రాజీవ్ విద్యా దీవెన కింద 9,10 తరగతుల్లో ఏడాదికి రూ. 2,200; ఇంటర్‌లో పోస్ట్ మెట్రిక్ స్కాలర్ షిప్ కింద ఏడాదికి రూ. 3,600; డిగ్రీలో ఏడాదికి రూ. 10,000.

మీడియా

# గత వైభవం కాదు,

# నేటి నిజం మాట్లాడండి!

-కె. అరుణ

ఈ మధ్యకాలంలో పత్రికలు, ఛానళ్లలో పతాక శీర్షికన కనిపిస్తుందేంటో విజ్ఞులైన మీకు ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. అది, 'వందేళ్ళ సినిమా' అవునా! వారి ఘన చరిత ఏమో కానీ, నాకైతే ఒకే నానుడి పదే పదే గుర్తొస్తోంది. అది 'మా తాతలు నేతులు తాగారు. కావాలంటే, మా మూతులు వాసన చూడండి' అన్నది నా అభిప్రాయం. మీకేమైనా తప్పుగా తోస్తోందా? లేదుగా ! హమ్మయ్య ! బతికించారు !లేకపోతే ఏమిటండీ! గతకాలపు వైభవాన్ని ఎవరు కాదన్నారు? కానీ, గతంలో తిన్న పాయసాలు తలుచుకుంటూ వర్తమానంలో పస్తులు కూర్చోలేముగా !

ప్రస్తుతం వస్తున్న సినిమాలను చూడండి ! వాటినుండి ఒక్కటన్నా మంచి నేర్చుకుంటున్నామా ? మంచి సంగతి పక్కనపెట్టండి! చెడు నేర్చుకుంటే చాలు అనుకోవాల్సిన పరిస్థితి కదా నేడున్నది ! ఈ మధ్యకాలంలో రిలీజైన సినిమాలను ఓసారి గుర్తుచేసుకోండి! లేత వయసు, బూతు ప్రేమలు,అసహ్యపు వెకిలి నవ్వులు, అరిగిపోయిన ఫ్యాక్షన్ పగలు, వంశాల చరిత్రను వల్లెవేసే కుక్కమూతి పిందెలు, చిత్ర పరిశ్రమనంతా గుప్పిట్లో పెట్టుకుని వికటాట్టహాసం చేసే అధినాయకులు, వంగుతూ లేస్తూ వేదికపైకొచ్చి అవకాశమొస్తే మునిమనుమబరాలి వయసు హీరోయిన్‌తో సరాగాలాడేయడానికి సిద్ధమనే అలనాటి కథానాయకులు, లక్షలను బట్టి దుస్తుల కొలతలు మార్చే దిగుమతి చేసుకున్న తారకలు.... ఇవన్నీ సినీ పరిశ్రమ ఆడిస్తున్న నాటకంలో భాగాలు ! ఇవన్నీ చూడటానికి మనం మనిషికి 75రూపాయిలు చెల్లించాలి. పార్కింగ్, తిండి ఖర్చు అదనం!ఒక కుటుంబం సినిమాకు వెళ్ళాలంటే ఎంత ఖర్చవుతుందో ఓసారి ఆలోచించండి! గుండెలు గుభిల్లుమన్నాయా ? అది సినీరంగం ఒప్పుకోవడంలేదే! మనం ఏమన్నా అంటే తెగ ఉపన్యాసాలు దంచేస్తున్నారు. నిన్నగాక మొన్న ఒక గ్రీకువీరుని భాషణం ఏమంటే, 'మొన్న స్పెయిన్‌లో నేను ఓ సినిమాకు వెళ్తే '100 యూరోలు' పెట్టి టిక్కెట్ కొన్నా, ఇప్పుడు బోలెడు ఖర్చులు పెరిగాయి. సినిమాకు ఆమాత్రం ఖర్చుపెట్టక తప్పదు' అని! మరి అయ్యగారు అక్కడే సినిమాలు తీసుకుని విడుదల చేసుకోపోయాడా ? ఇక్కడిదాకా దేక్కుంటూ వచ్చి మన మీద అయనగారి విన్యాసాల ప్రదర్శనలేల ? మనం వదిలించుకోలేక ఛస్తున్నామిక్కడ! ఈ సంగతులన్నీ ఆయనకు తెలుసు. అక్కడ సినిమా తీయలేడు. అక్కడలా క్వాలిటీ చేతకాదు. అర్థంకానీ చెత్తతీస్తే అభిమానులమంటూ తోసుకుని, కొండొకచో ప్రాణాలు పోగొట్టుకుని మరీ సినిమాకోసం ఎగబడే అమాయకులు అక్కడ ఎవరూ దొరకరు. అన్ని కబుర్లు చెప్పే ఈ గజ ఈతగాళ్లు వాళ్లు తీసుకునే డబ్బులో పైసా తగ్గించుకోరు. 'అమ్మ పుట్టిల్లు మేనమామకు తెలీదా ?" వీళ్ల వేషాలు మన దగ్గరా?

మనం విదేశీ రోడ్లపై మన వారి శృంగార స్టెప్పులు చూస్తాం, కానీ, ఈ సారి ఆపాటలు చూసేటప్పుడు అక్కడ షూటింగ్ సమయంలో మూగే జనాలను గమనించండి! వీళ్లకేమైనా పోయేకాలమొచ్చిందా ? అన్నట్లు చూస్తుంటారు. చూడటం కాదు, గుంభనంగా నవ్వుకుంటారు కూడా! ఆపై, 'యూ నో! ఇండియన్ మూవీస్ ఎంత స్టుపిడ్‌గా ఉంటాయో' అని చెప్పుకుంటారు కూడా ! అయినా, మనం ఇవేమీ పట్టించుకోం, కారణం, సినిమాలపట్ల మనకున్న మోజు అలాంటిది! సినిమావాళ్లంటే దివి నుండి భువికి దిగివచ్చిన తారలని కొలవడం సినీరంగానికి ఎంత ఆహం పెంచుతోందో సినీ అభిమానులు ఆలోచిస్తే ఎంత బాగుండు!

ఇవి చాలవన్నట్లు, మొన్నా మధ్య ఓ పెద్దమనిషి,'వందేళ్ల క్రితం కూడా బూతులున్నాయి' అన్నాడు. మరో మగానుభావుడు, 'అప్పట్లోనే ముద్దు సీన్లున్నాయి. ఓ ఇటలీ సినిమాలో చూశా' అంటున్నాడు. ఆనాటి శృంగార సన్నివేశాలు వేరు! ఆ డైలాగులు వేరు! మరిప్పుడో! అరటిపండు వలిచి నోట్లో పెట్టినంత ఒయినంగా ! అర్థంకాకుంటే, 'డోంట్ వర్రీ' అంటూ స్వయంగా చూపిస్తూ వివరించేంత ఘనంగా ! దీన్ని ఈ పెద్ద మనుషులు ఏ ధైర్యంతో సమర్థించుకుంటున్నారో అర్థంకాదు. అనాటి ప్రేమ దృశ్యాలు, ఆనాటి వ్యాంప్ కేరెక్టర్లు, ఆనాటి క్లబ్ సాంగులు.... ఓసారి గుర్తుచేసుకుంటే చాలు! ఆనాటి హుందాతనం, ఈనాటి లేకితనం మధ్య తేడా కళ్లకు కట్టినట్లు కనిపిస్తుంది. పైగా, ఆనాడు సినిమా చూసొస్తే అంతటితో సరి! మరి నేడు! టివి, సెల్లు, ఇంటర్నెట్ అన్నిటా ఆ సీన్లు, సాంగులు అప్రతిహతంగా విహారం చేస్తుంటే ఆ ప్రభావం తెలిసీ తెలియని లేత మనసులపై ఎలా ఉంటుందో తెలీదా ? ఇంతకంటే, వీరికి వివరణ

**తరువాయి 45వ పేజీలో**

ఆరోగ్యం

# ఎండతో ఎముకల ఆరోగ్యం



నేటి మన జీవనశైలి వల్ల ఎముకల్లో ఆరోగ్యం క్షీణిస్తోంది. దీనికి వయస్సుతో నిమిత్తంలేదు. చిన్నా పెద్ద అందరిలో ఈ లోపం కనిపిస్తుంది. అందుకే కాస్తంత ఎముకల ఆరోగ్యంపై దృష్టిపెడితే మంచిది! మరీ ముఖ్యంగా మహిళలు దీనిపై శ్రద్ధ ఎక్కువే చూపాలంటున్నారు నిపుణులు. ఎముకల పెరుగుదలకు విటమిన్ డి ఎంతో దోహదపడుతుంది. ప్రపంచంలో ఈ విటమిన్ లోపం లేని దేశం లేదంటున్నారు పరిశీలకులు. విటమిన్ డి లోపాన్ని అధిగమించాల్సిన అవసరం ఇప్పుడు అందరి ముందుకొచ్చింది.

మన దేశంలో సుమారు 80 శాతం మంది పిల్లల్లో, 84శాతం మంది గర్భిణుల్లో విటమిన్ డి లోపం ఉందని, ఈ ప్రభావం పుట్టబోయే బిడ్డ మీద కూడా పడుతుందనీ వైద్య పరిశోధకులు చెబుతున్నారు. చూడడానికి అందరం ఎంతో ఆరోగ్యంగా, చాలా బాగున్నట్లు కనిపించొచ్చు కానీ, ఒళ్లు నొప్పులు, చీకాకు లాంటి లక్షణాలు విటమిన్ డి లోపం వల్ల కనిపిస్తాయి. ఈ విటమిన్ లోపం ఉందో, లేదో తెలుసుకోవాలంటే రక్త పరీక్ష చేయించుకోవాలి.

**'డి' విటమిన్ ఎలా వస్తుంది ?**

మన చర్మానికి సూర్యరశ్మి తగిలినప్పుడు చర్మంలో ఉండే కొలెస్ట్రాల్ కాస్తా విటమిన్ డిగా మారుతుంది. మనదేశంలో సూర్యరశ్మికి ఏ మాత్రం లోటులేదు. అయినా ఈ విటమిన్ డి లోపం సుమారు 80శాతం మందికి ఎందుకున్నట్లు? నేటి మన జీవన విధానమే అందుకు ప్రధానకారణం. ఎక్కువగా ఇంట్లోనే ఉండి పోవడం బయటకెళ్లకుండా ఉండడం వల్ల విటమిన్ డి లోపం వస్తోంది. ఉదయం 10 గంటల నుండి సాయంత్రం 4 గంటల మధ్య లో ఓ పావుగంట సేపు ఎండ తగిలేలా చూసుకుంటే మంచిది. దీనివల్ల మన శరీరానికి కావల్సినంత విటమిన్ డి లభిస్తుంది.

ఇక విటమిన్ డి అందకపోతే ఎముకలు పెళుసుగా మారిపోతాయి. అంతేకాదు ఎముక కణజాలం క్షీణించే వ్యాధి వస్తుంది. ఈ వ్యాధి ఎముకల్ని పెళుసు చేస్తుంది. బాధాకరంగా ఉంటుంది. ముఖ్యంగా ఈ ఎముకల పెళుసుదనం వల్ల కటి భాగం, వెన్నెముక, మణికట్టు భుజం ఎముకలు విరిగేప్రమాదం ఉంది. ఇది మన శరీర భంగిమలో కూడా మార్పు తీసుకొస్తుంది. ఈ పరిస్థితికి స్త్రీ పురుషులిద్దరూ ప్రభావితమవుతారు. అందుకే ఎముకల ఆరోగ్య ప్రాధాన్యాన్ని ప్రతి ఒక్కరూ గుర్తించాల్సి ఉంది. మహిళల్లో సాధారణంగా ఎముకలు పురుషుల కన్నా సన్నగా వుంటాయి. అందులోనూ మహిళల్లో హార్మోన్ల ఉత్పత్తి జరిగినప్పుడు ఉండే ఎముకల పటిష్టత ఋతుక్రమం ఆగాక క్రమంగా క్షీణిస్తుంది. దీంతో ఎముకల్లో పెళుసుతనం పెరుగుతుంది. పురుషుల్లో ప్రధానంగా వృద్ధాప్య ఛాయలు కనిపించినప్పుడు ఈ లోపం కనిపిస్తుంది. ఈ ఎముకల పెళుసుదనమే కొన్నిసార్లు అస్థియో ఆర్థరైటిస్‌కు దారితీస్తుంది.

**మహిళల్లో...**

ఋతుక్రమం ఆగిపోయిన తర్వాత ఈస్ట్రోజెన్ హార్మోను లోపం మహిళల్లో ఎక్కువగా కనిపిస్తుంది. దీనివల్ల వీరిలో ఎముకల్లో పెళుసుదనం వ్యాధి వచ్చేఅవకాశాలు ఎక్కువ. అన్ని వయస్సుల మహిళలూ ఎముకల ఆరోగ్యంపై దృష్టి పెట్టాలి. సుమారు 50 ఏళ్ళ వయస్సు మహిళల్లో 20శాతం మందికి పెళుసు ఎముకల వ్యాధి వస్తోంది. అయితే ఇది వారు 30ఏళ్ళ వయస్సులో వున్నపుడే ప్రారంభమై 40ఏళ్ళు వచ్చేటప్పటికీ ప్రభావితం చేయవచ్చు.

ఎముకల్లో నిరంతరం విచ్ఛిన్నమై, పునరుద్ధరణకు గురయ్యే కణజాలం ఉంటుంది. మంచి ఎముక పుష్టి నిర్మాణం యౌవనంలోనే మొదలవుతుంది. ఇలా మొదలైతే మాత్రం 30ఏళ్లు వచ్చేటప్పటికీ ఎముకలు మరింత బలంగా ఉంటాయి. మధ్యవయస్సుకు వచ్చేటప్పటికి కొందరిలో ఎక్కువగా, మరికొందరిలో తక్కువగా ఎముకల బలహీనత ఏర్పడుతుంది. ఆ తర్వాత మాత్రం ఎముక నిర్మాణం, నష్టం మధ్య సమతౌల్యం సాధించడం కష్టమవుతుంది. మీరు ఎముక ఆరోగ్యంపై దృష్టి పెట్టకపోతే బాధాకరమైన పెళుసు ఎముకల వ్యాధికి గురికావచ్చు. విటమిన్ డి తక్కువగా ఉన్నప్పుడు కిందపడగానే ఎముకలు విరిగే అవకాశాలెక్కువ. వృద్ధుల్లో ఈ పరిస్థితి మరీ ఎక్కువ.

**ఇట్టే గుర్తించగలం.**

మహిళల్లో కాల్షియం నిల్వలు వారికి పుట్టబోయే బిడ్డలకు బలమైన ఎముకలు రూపొందేలా తోడ్పడతాయి. మహిళలు సాధారణంగా ఎక్కువ మందిలో ఈస్ట్రోజన్ హార్మోన్ తగ్గుదల లక్షణాలు కన్పిస్తాయి. దీనివల్ల ఎముకలు పెళుసుగా మారిపోతాయి. ఇలాంటి సమయంలోనూ, ఋతుక్రమం ఆగిపోయిన తర్వాత మన దేశంలో మహిళలు ఎముక సాంద్రత పరీక్షలు చేయించుకోవడం లేదు. నిజానికి దీనికి పెద్ద ఖర్చు కూడా కాదు.

ఎముకల్ని రక్షించుకునేందుకు స్కాన్ చేయించుకోవడం తోడ్పడుతుంది. అయితే ఎముకల ఆరోగ్యాన్ని కాపాడుకొనేలా మన జీవనశైలిలో మార్పులు

చేసుకోవాలి. కుటుంబ వైద్యుణ్ణి సంప్రదిస్తూ ఉండాలి. సాధారణంగా ఎముకలు పెళుసు బారడమనే వ్యాధిని నిరోధించడానికి, తగ్గించడానికి మంచి మార్గం ఏమిటంటే క్యాల్షియం 1000 మి.గ్రా విటమిన్ డి ని ప్రతిరోజు 400 ఐయు తీసుకోవాలి. అయితే ఇవి తీసుకోవడం వల్ల మూత్ర పిండాల్లో రాళ్ళు ఏర్పడే అవకాశం ఉంది. నివారించాలంటే నీళ్ళు బాగా తాగాలి.

**క్యాల్షియమే కీలకం**

గర్భ నిరోధక మాత్రలు కూడా ఎముకల్ని బలహీనపరుస్తాయి. ఋతుక్రమం ఆగిన వారిలో, ఈస్ట్రోజన్ హార్మోన్ చికిత్స తీసుకునే వారిలో ఎముకలు పెళుసుబారిపోవడమనే వ్యాధి ప్రభావం ఎక్కువ. అయితే, మంచి ఆహారం తీసుకోవడంవల్ల ఎముక పుష్టిని పెంచుకోవచ్చు. ఎముకల్ని క్యాల్షియం శక్తివంతం చేస్తుంది. ఎముకల్లో, దంతాల్లో క్యాల్షియం నిక్షిప్తమై ఉంటుంది. అందువల్ల మహిళలు క్యాల్షియం, ఖనిజాలు రోజువారీ ఆహారంలో ఉండేలా జాగ్రత్త తీసుకోవాలి. దురదృష్టమేమంటే గర్భిణుల్లో విటమిన్ డి లోపం ఎక్కువగా ఉంటుంది. పాలు, పెరుగు, జున్ను లాంటి పాల ఉత్పత్తుల్లో క్యాల్షియం పుష్కలం. అలాగే సోయాబీన్, నేరేడు పళ్లు, ద్రాక్ష, నారింజ, గింజలు, గుడ్లు, చేపల్లో కూడా క్యాల్షియం గ్రహించే శరీర సామర్థ్యాన్ని ప్రభావితం చేయవచ్చు. అందువల్ల కెఫిన్ తీసుకోవడం తగ్గించాలి. అతిగా మద్యపానం కూడా ఎముక నష్టానికి దారితీస్తుంది.

ప్రధానంగా శాఖాహారులకు ఆహారం ద్వారా అందాల్సినంత విటమిన్ డి అందదు. మన ఆహారంలో ఉప్పు కూడా క్యాల్షియం ప్రభావితం చేస్తుంది. అందుకనే ఈ కాల్షియంను నిలుపుకోవడానికిప్రాసెస్ చేసిన ఆహారాలకు దూరంగా ఉండాలి. వ్యాయామం కూడా ఎముక ఆరోగ్యాన్ని మెరుగుపరుస్తుంది. మనం మోయగలిగే బరువున్న సాధనాలతో వ్యాయామం చేయడం. వేగంగా నడవడం, సైకిల్ తొక్కడం, టెన్నిస్ ఆడడం, నృత్యం, యోగా చేయడం కూడా ఎముకల బలానికి తోడ్పడతాయి.

మానవి డెస్క్

---

**43వ పేజీ తరువాయి**

అనవసరం.

దీనికి తోడు, పైరసీ మహా పాపం, చూసిన వాళ్లకు శాపం అంటూ ప్రకటనలు సరేసరి! మొత్తం కుటుంబమంతా సినిమాకెళ్తే అయ్యే ఖర్చు. రానుపోను చార్జీలు, తిండి....వగైరాలు లెక్కలేసుకుని, గుండెలు బాదుకుని, ఆ డబ్బుతో కొండెక్కిన పప్పు, ఉప్పులు కొనుక్కోవచ్చని మనసుకు సర్దిచెప్పుకుని, ఇరవై రూపాయిలకే దొరికే సీడీలు కొనుక్కుని కొత్త సినిమాలు చూడటం తప్పు. వాళ్లు మాత్రం, సకల భాషల సినిమాలు దర్జాగా చౌర్యం చేయొచ్చు. పరాయి భాషల సంగీతాన్ని ప్రేరణ పొందామంటూ బాహాటంగా కాపీకొట్టచ్చు. పరాయి కథ,పరాయి నటులు, పరాయి దర్శకులు....వగైరాలతో తెరనిండా పరచి సహజత్వాన్ని తుంగలో తొక్కొచ్చు. ఒకేసారి వందల థియేటర్లలో సినిమాను విడుదలచేసి అమాయక అభిమానుల జేబులు కొల్లగొట్టొచ్చు. వారం రోజుల్లో కోట్లు వసూలు చేసుకుని బిచాణా ఎత్తేయచ్చు. మనం మాత్రం రెక్కలు ముక్కలు చేసుకుని వచ్చిన సొమ్ములు మనకోసం ఖర్చుచేసుకోకుండా, వాళ్ల మొహాన కొట్టాలి. ఇదేం న్యాయం చెప్పండి?

సందర్భం వచ్చింది కనుక మరో విషయమూ మాట్లాడేసుకుందాం! ఈ మధ్య టెలివిజన్‌లో కేవలం తెలుగు సీరియళ్లే రావాలనీ, డబ్బింగ్ సీరియళ్లు వలదనీ... మేకప్ వేసుకుని మరీ ధర్నా చేస్తున్న నటీనటులను చూస్తున్నాం. తెలుగు సీరియళ్లలో విషయం ఉంటే పరాయి వాటికి ఎందుకు ఎగబడతారు ? పూర్తిగా పరాయి భాషా సీరియళ్లను సమర్థించడం లేదు, కానీ, మనం తీసుకుంటున్న జాగ్రత్తలేంటి అని బేరీజు వేసుకోవాలిగా! తెలుగుదనం కనిపించకున్నా వాటిని ఎందుకు ఆదరిస్తున్నారు ? కథాపరంగాను, నటనాపరంగాను నాణ్యతా ప్రమాణాలు పాటించకుండా.... అవి ప్రసారం చేయకూడదు అనడం ఎంతవరకూ సబబు ? పది యాంగిల్స్‌లో మొహం తిప్పడాలు, ఆడదానికి ఆడదే శత్రువు అని అబద్ధపు ప్రచారంచేసే అర్థవిహీన సన్నివేశాలు, చూపులతోనే కాల్చేసుకోవడాలు, సొంతవాళ్లపైనే ప్రతీకారాలు... వీటిని ఏమని చూడాలి ? పైపెచ్చు ఒక నిముషం సీరియల్, 5 నిముషాలు ప్రకటనలతో నింపుతుంటే ఎలా ఓపిక వహించాలి ? సీరియల్‌లో దమ్ముంటే పోనీ అనుకుందాం! అది లేనేలేదు. దాన్ని సరిచేసుకోకుండా పరాయి భాషల సీరియళ్లను వ్యతిరేకించడం ఏంటో ? 'ఆడలేక మద్దెల ఓడు' అంటే బహుశా ఇదేనేమో!

ఏతావాతా చెప్పొచ్చేదేమంటే.... వేం సినిమాలకు వ్యతిరేకం కాదు, సీరియళ్లకు శతువులం కాదు. అలసిసొలసి సరదాగా చూద్దామనుకుంటే... అవి వెదజల్లుతున్న కంపుకు వ్యతిరేకం. చాపకింద నీరులా పాతుకుపోతున్న ధోరణులకు వ్యతిరేకం. విచ్చలవిడితనానికి, విశృంఖలత్వానికి ఆమడ దూరం. ఈ పెడ ధోరణులను సరిచేసుకోండి. అప్పుడు అందరూ ఆదరిస్తారు. అది సినిమా అయినా సరే, సీరియల్ అయినా సరే! అక్కున చేర్చుకుంటారు. 'ఇదీ మన వందేళ్ల చరిత్ర' అంటూ గర్వంగా చెప్పుకుంటారు!

# ఉద్యమాల బాటలో

**వీధి లైట్లకోసం :** మహబూబ్‌నగర్ జిల్లా నాగర్‌కర్నూల్ పట్టణంలో



మహబూబ్ నగర్

వీధిలైట్లు లేక మహిళలు, పాదచారులు చాలా ఇబ్బందులు పడుతున్నారు. మహిళల మెడల్లోంచి గొలుసులు దొంగతనం చెయ్యడంతోపాటు, అనేక యాక్సిడెంట్‌లు కూడా జరుగుచున్నవి. వీధిలైట్ల సమస్య పరిష్కరించాలని,బడ్జెట్ కేటాయింపులు జరపాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తూ, ఆర్.డి.ఓ. కార్యాలయం వద్ద ఐద్వా నిరాహార దీక్షలు చేసింది. అధికారులు స్పందించి వీధిలైట్లు ఏర్పడుటకు సత్వర చర్యలు తీసుకుంటామని హామీ ఇచ్చారు. ఐద్వా కృషిలో వీధిలైట్లు అన్ని వీధుల్లో వెలుగుతున్నవి.

**అంతర్జాతీయ మహిళాదినోత్సవం :** మార్చి 8 అంతర్జాతీయ



వరంగల్

మహిళాదినోత్సవం సందర్భంగా,ఐద్వా, సి.ఐ.టి.యు, యు.టి.ఎఫ్‌ల ఆధ్వర్యంలో అన్ని పట్టణాలు, మండల కేంద్రాలలో సదస్సులు, ప్రదర్శనలు జరిగాయి. మార్చి8 ప్రాధాన్యతను వివరిస్తూ, పోరాటాల ద్వారానే మహిళల హక్కులు నిలబడతాయని, చెప్తూ, మహిళలపై పెరిగిపోతున్న హింసను అరికట్టడానికి అందరు కలిసి సమైక్యంగా ఉద్యమించాలని పిలుపునిచ్చారు. రాష్ట్రవ్యాప్తంగా పెద్ద సంఖ్యలో మహిళలు ఈకార్యక్రమాల్లో పాల్గొన్నారు.




మహబూబ్ నగర్

**మహిళలపై పెరిగిన హింసను నిరసిస్తూ :** దేశవ్యాప్తంగా,రాష్ట్రంలో



చిత్తూరు

మహిళలపై అత్యాచారాలు, హత్యలు, వేధింపులు, హింస, నిత్యకృత్యమైనవి. నిర్భయ ఘటనానంతరం చట్టం వచ్చిన తర్వాత కూడా విచ్చలవిడిగా మహిళలపై నేరాలు పెరిగాయి. ప్రభుత్వం వెంటనే మహిళలకు భద్రత కల్పించేలా చర్యలు చేపట్టాలని,పోలీసు అధికారుల నిర్లక్ష్య వైఖరి నశించాలని, బాధ్యతారహితంగా వ్యవహరించిన పోలీసు అధికారులను కఠినంగా శిక్షించాలని, ఫాస్ట్



హైదరాబాద్


విజయవాడ

ఐద్వా ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది. ఐద్వా ఆందోళనాకార్యక్రమాలవల్ల 'మిసెస్ ఒంగోలు' కార్యక్రమాన్ని రద్దుచేసుకున్నారు.

**మోటూరు ఉదయంగారి వర్థంతి :** మార్చి 31 ఐద్వా నిర్మాతల్లో


ప్రకాశం


పశ్చిమగోదావరి

ట్రాక్ కోర్టులు ఏర్పాటుచేయాలని, హెల్ప్‌లైన్ నెంబర్‌ను వెంటనే ప్రకటించి, అమలులో పెట్టాలని ప్రభుత్వాన్ని మహిళలు డిమాండ్ చేసారు.


నెల్లూరు

**అందాల పోటీలను నిరసిస్తూ :** ఒంగోలులో 'మిసెస్ ఒంగోలు'



అందాల పోటీలను నిరసిస్తూ ఐద్వా ఆధ్వర్యంలో ఆందోళనా కార్యక్రమాలు జరిగాయి. మహిళలు, ప్రజలు అనేక రకాలైన సమస్యలతో భాదపడుతుండగా 'మిసెస్ ఒంగోలు' పేరుతో అందాల పోటీని నిర్వహించడం దారుణమన్నారు. అందం అనేది బహుముఖ్యమైనది. కేవలం బాహ్య సౌందర్యానికే ప్రాముఖ్యతనిచ్చే ఈ పోటీలు మహిళలను సమస్యల నుంచి ప్రక్కదారి పట్టించడంతోపాటు, మహిళల మధ్య పోటీని పెంచుతాయి. నిర్వహణకు అనుమతులు ఇవ్వకుండ అందాలపోటీని ఆపాలని


మహబూబ్‌నగర్


ప్రకాశం

ఒకరైన మోటూరు ఉదయంగారి వర్థంతి సందర్భంగా సదస్సు రాష్ట్రకేంద్రంతోపాటు, అన్ని జిల్లాల్లో కార్యక్రమాలు జరిగాయి. హైదరాబాదులో 'ప్రస్తుత సమాజంలో కుటుంబ వ్యవస్థ' అనే అంశంపై జరిగిన సదస్సులో డా॥పద్మజ గారు, మరియు అడ్వకేట్ సురేష్‌గారు పాల్గొన్నారు. ఒంగోలు, అనంతపురం, మహబూబ్‌నగర్, హైదరాబాదు, తూ.గో, ప.గో, ఖమ్మం, నల్గొండ జిల్లాల్లో అవగాహన సదస్సులు, మెడికల్ క్యాంపులు, సదస్సులు నిర్వహించబడ్డాయి.

**బస్సులో మహిళల సీట్లు మహిళలకే :** ఆర్.టి.సి. బస్సుల్లో మహిళల


చిత్తూరు

సీట్లు మహిళలకే కేటాయించాలని, ఆ సీట్లుకు ప్రత్యేకంగా రంగువేసి చూడగానే గుర్తించేటట్టు చూడాలని, వికలాంగులకు, సీనియర్ సిటీజన్లకు కేటాయించిన సీట్లు జనరల్ సీట్లలో కేటాయించాలని కోరుతూ, రీజినల్ మేనేజర్‌కు చిత్తూరు ఐద్వా జిల్లాకమిటీ ఆధ్వర్యంలో వినతిపత్రం ఇచ్చింది. ప్రయాణికుల్లో కరపత్రాలు పంచుతూ విస్తృతంగా ప్రచారం చేసారు.

**రైలులో మహిళా భోగి పోర్పాటు :** రైలులో మహిళలకు ప్రత్యేకంగా మరియు పూర్తి స్థాయిలో భోగి ఏర్పాటు చేయాలని, తిరుపతి స్టేషన్ మాస్టర్‌కు చిత్తూరు ఐద్వా జిల్లాకమిటీ ఆధ్వర్యంలో మెమోరాండం ఇచ్చారు. రైళ్ళలో విపరీతమైన రద్దీతో వుండటంవల్ల మహిళలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. మహిళలు ఎదుర్కొంటున్న ఇబ్బందులను దృష్టిలో పెట్టుకొని మహిళల భోగిని పూర్తిస్థాయిలో పునర్దురించాలని ఐద్వా ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది.


చిత్తూరు

**న్యాయ సలహా కేంద్రం ప్రారంభం :** మోటూరు ఉదయం 11వ


తూర్పుగోదావరి

వర్థంతి సందర్భంగా తూర్పుగోదావరి జిల్లా అమలాపురంలో కుటుంబ న్యాయ సలహా కేంద్రాన్ని ప్రారంభించారు. ఈ ప్రారంభోత్సవ కార్యక్రమానికి ట్రస్ట్ రాష్ట్ర కేంద్రంతో పాటు స్థానిక పోలీస్ అధికారులు, జడ్జి మరియు న్యాయవాదులు, ఇతర రంగాలలో పని చేస్తున్న ప్రముఖులు హాజరయ్యారు.


తూర్పుగోదావరి

**బెల్టు షాపులకు వ్యతిరేకంగా :** కృష్ణా జిల్లా మారు మూల గ్రామం నరసింహారావు పాలెం. ఈ చిన్న గ్రామంలో ఏడు బెల్టు షాపులున్నాయి. ఇటీవల తాగుడుకు బానిసైన 22 సంవత్సరాల యువకుడు మరణించడంతో డ్వాక్రా మహిళలు, యువకులు కలిసి బెల్టు షాపులకు వ్యతిరేకంగా ఐద్వా ఆధ్వర్యంలో పెద్ద ఎత్తున ఉద్యమించారు.


కృష్ణా

# అంబేద్కర్ ప్రబోధాలు



ఏప్రిల్ 14
అంబేద్కర్ జయంతి సందర్భంగా...

- "ఒక మనిషిని దేవునిలా కొలవడం మంచిది కాదు. వ్యక్తి పూజ వినాశనానికి దారి తీస్తుంది. దానిని మొగ్గలోనే త్రుంచివేయాలి. సమస్యలన్నీ ఒక్కరి మీద ఉంచడం వల్ల ఆ ఒకరి మీద ఆధారపడటం అలవాటైపోతుంది. తద్వారా కర్తవ్యాల నుండి విముఖులై బాధ్యతారహితంగా ప్రవర్తించడానికి అవకాశముంది. మనం ఇలాంటి భావాలకూ, ఆలోచనలకూ తావిచ్చినట్లయితే మన పరిస్థితి నీటి ప్రవాహంలో కొట్టుకుపోయే కొయ్య దుంగలకంటే ఏ మాత్రమూ మెరుగ్గా ఉండదు.
- మూఢ నమ్మకాలనుండి వెలుపలికి రండి, ఇతర దేశాలలో జాతికి, దేశానికి గొప్ప ఆపద సంభవించినపుడు ప్రజలందరూ ఏకమై ఆ ప్రమాదాన్నెదుర్కొంటారు. కాని మనదేశంలో ఏ దైవమో దిగివచ్చి తమను రక్షిస్తాడని ఎదురుచూస్తూ ఉంటారు. మనం చేయవలసిన పని మానేసి మరెవరో వచ్చి చేసి పెడతారని ఎదురుచూడటం వెర్రితనం. మనం అలాంటి భ్రమలకు, ప్రమాదాలకు లోను కావద్దు"
- బానిసత్వాన్ని మనమే తొలగించుకోవాలి. రాజకీయాధికారంతోనే మన సమస్యలు పరిష్కృత మవుతాయి కాని,తీర్థయాత్రలవల్ల కాదు. పూజలు, పునస్కారాలవల్ల తిండి, బట్ట, సంఘంలో గౌరవమూ రావు. మన జీవితంలో మార్పు రాదు. మన జీవితాలలో మార్పు రావాలనీ, మన పిల్లలు విద్యావంతులై సంఘంలో గౌరవ మర్యాదలు పొందాలనీ అనుకుంటే ఆ ప్రయత్నాలు మనమే చెయ్యాలి. స్వశక్తితో సాధించుకోవాలి. రాజకీయాధికారం ఆ శక్తినిస్తుంది"
- అందరికీ తిండి, బట్ట, ఇల్లు, విద్య, వైద్య సదుపాయాలు కల్పించటం ప్రభుత్వ విధి,చట్టాలు చేయడం,వాటిని అమలు పరచడం అంతా ప్రజల అంగీకారంతో, సహకారంతో, ఇష్టంతో జరగవలసిందే. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రాపంచికమైన అన్ని ఆనందాలకూ చట్టమే అలవాలం. శాసన నిర్మాణాధికారాన్ని చేజిక్కించుకోండి. ఆ వైపు దృష్టి మరల్చండి. ఇదే విమోచన మార్గం. దేశానికి గాని, జాతికి గాని సంఖ్యాబలమొక్కటే చాలదు. మనం ఎప్పుడూ అప్రమత్తులై, విద్యావంతులై ఆత్మగౌరవంతో, ఆత్మ విశ్వాసంతో ఉన్నప్పుడే మన జాతి బాగుపడుతుంది"
- స్త్రీలు సామాజికంగా, రాజకీయంగా ముందుకు రావాలి. వారివల్లనే జరిగే పనులు సమాజంలో చాలా ఉన్నాయి. వారి తోడ్పాటుతోనే సమాజం అభివృద్ధి చెందుతుంది.
- 'మతం అనేది శాస్త్రానుగుణంగా, హేతుబద్ధంగా ఉండాలి. అలా లేనినాడు అది వివాదాస్పదమై క్షీణించిపోతుంది"
- "మతం మనిషి కోసం ఏర్పడింది గానీ మనిషి మతం కోసం కాదు. మతం పేదరికాన్ని సమర్థించి శ్లాఘించకూడదు. అలా చేయటం భూలోకాన్ని నరకలోకంగా మార్చటానికి అనుమతించటమే"
- "మానవుల వలె బ్రతికే హక్కు ఏ మతంలో లేదో ఆ మతాన్ని విడనాడటం కంటే గత్యంతరం లేదు".
- 'ఒక దేశానికి గాని, జాతికి గాని సంఖ్యాబలమొక్కటే చాలదు. వారు అప్రమత్తులై విద్యావంతులై ఆత్మ గౌరవంతో, ఆత్మ విశ్వాసంతో ఉన్నప్పుడే ఆ దేశమూ ఆ జాతీ బాగుపడుతాయి.'
- దళితుల అభ్యుదయానికి ఆత్మ గౌరవం, ఆత్మాభిమానం, స్వయం సేవ అనేవి అత్యంతావసరాలు'
- "విద్య అందరికీ అందుబాటులో ఉండాలి. అందరినీ విద్యావిషయకంగా సమాన స్థాయికి తీసుకురావాలంటే ఆ పద్ధతుల్లో కొంత అసమానత, పక్షపాతం చూపక తప్పదు. వెనుకబడిన వర్గాల వారికి కొంత ప్రాతినిధ్యం ఇవ్వవలసి వస్తుంది"
- "విశ్వ విద్యాలయాలలోని విద్యావిధానం ఆధునిక అవసరాలకు తగినట్లుగా ఉండాలి. అది గుమస్తాల ఉత్పాదక కేంద్రం కాకూడదు"
- "గౌరవ ప్రదమైన జీవితం గడపటం మానవునికి పుట్టుకతో వచ్చిన హక్కు. ఒక జాతికి ఈ హక్కు సాధించటం కోసం ఎవరైనా చేయగలిగినంత త్యాగం గాని పోరాటం గాని తప్పక చేయాలి. ప్రతిఘటన లేనిదే ఏ పనీ జరగదు"
- "స్వయం కృషి, ఆత్మ విశ్వాసం మానవుని మనుగడకు అత్యంతావశ్యకాలు. విజ్ఞానం, నిరంతరమైన ఆలోచన, నిర్విరామ కృషి, ఏ మనిషినైనా ఉన్నత పథాలకు చేరుస్తాయి"
- "కర్మ, అదృష్టం అనే మాటలు ప్రక్కకు పెట్టి స్వశక్తిపై ఆధారపడండి"
- "కులం పేరు మీద ఒక జాతినిగాని ఒక నీతినికాని నిర్మించలేము."
- "ఏ విషయాన్నైనా ఎవరైనా సరే గుడ్డిగా అనుసరించకుండా ప్రతి విషయాన్ని తర్కించి లేదా స్వంత అనుభవాలతో నమ్మాలి.

"CHAITANYA MANAVI R.No. APTEL/2006-20000

అగస్ట్ బెబెల్

# మహిళలు - సోషలిజం

ప్రఖ్యాత కార్మికోద్యమ నేత రెండో ఇంటర్నేషనల్‌కు చెందిన ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు, జర్మన్ దేశస్థుడు అయిన అగస్ట్ బెబెల్ రచన మహిళలు - సోషలిజం గ్రంథం మొదలు 1879లోనే ప్రచురితమయింది. నేటి సమాజంలో మహిళలకు, మహిళా ఉద్యమానికి, కుటుంబ జీవితానికి ఎదురవుతున్న సమస్యలు, వాటి మూలాలు తెలుసుకునేందుకు ఈ గ్రంథం ఉపయోగపడుతుంది. ఐద్వా ఆంధ్రప్రదేశ్ కమిటీ 2010లో ఆంగ్లంలో ప్రచురించింది. సాధారణ మహిళలు, కార్యకర్తలకు చేరువలోకి తెచ్చేందుకు తెలుగులోకి అనువదించి ప్రచురించింది. స్త్రీ విముక్తిని, సామాజిక మార్పును ఆశించే ప్రతి ఒక్కరూ పుస్తకాన్ని చదవాలని ఐద్వా అభిలషిస్తుంది.




వెల : ₹.300/-
పోస్టేజి అదనం

ప్రతులకు :
ఐద్వా రాష్ట్ర కార్యాలయం,
బాగ్‌లింగంపల్లి మరియు, ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు

Printed & Published by Mallu Swarajyam, Published at AIDWA State Office, Block No.24, HIG, Phase-II, 1-8-1, Baghlingampally, Hyderabad -500 044. Printed at Prajasakti Daily Printing Press, M.H.Bhavan, Plot No.21/1, Azamabad Industrial Area, Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020. Ph: 27665420. Editor : T.Jyothi



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMY01A 139 |
| పుస్తకం పేరు | చైతన్య విపంచి |
| తారీఖు | 21/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | sandhya |
| పేజీలు విడదీసినది | sandhya |
| స్కాన్ చేసినది | sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |